ప్రభాత్ పట్నాయక్




# సంక్షోభంలో పెట్టుబడిదారీ వ్యవస్థ

# సంక్షోభంలో పెట్టుబడిదారీ వ్యవస్థ

రచన

**ప్రభాత్ పట్నాయక్**

స్వేచ్ఛానుసరణ

**ఎం.వి.ఎస్.శర్మ**




ప్రజాశక్తి బుక్‌హౌస్

ప్రజాశక్తి భవన్, అమరారెడ్డి కాలనీ, అరవిందా హైస్కూల్ వద్ద

తాడేపల్లి - 522 501. ఫోన్ : 0866 -2577533




ప్రచురణ సంఖ్య : 1676

ప్రతులు : 1000

వెల : ₹ 70/-

ప్రతులకు




ప్రజాశక్తి బుక్‌హౌస్
27-1-54, కారల్‌మార్క్స్ రోడ్, గవర్నర్‌పేట,
విజయవాడ -2, ఫోన్ : 0866 -2577533

బ్రాంచీలు
విజయనగరం, విశాఖపట్నం, కాకినాడ, ఏలూరు, విజయవాడ,
గుంటూరు, ఒంగోలు, నెల్లూరు, తిరుపతి, కర్నూలు, అనంతపురం
ముద్రణ
ప్రజాశక్తి డైలీ ప్రింటింగ్ ప్రెస్, విజయవాడ
website : www.psbh.in
prajasaktipublishinghouse@gmail.com



# విషయసూచిక

# ముందు మాట

పెట్టుబడిదారీ ఆర్థిక సంక్షోభం ప్రపంచాన్ని చుట్టుముట్టింది. అన్ని ఖండాల్లోని పెట్టుబడిదారీ దేశాలన్నిటా ఆకలి కేకలు వినిపిస్తున్నాయి. నిరుద్యోగం ప్రబలింది. ఆర్థిక అసమానతలు పెరిగాయి. భారత దేశ పరిస్థితి దీనికి భిన్నం ఏమీ లేదు.

పెట్టుబడిదారీ వ్యవస్థలో సంక్షోభాలు అనివార్యం, అలలమాదిరిగా అప్పుడప్పుడు వచ్చే సంక్షోభాలు క్రమంగా తుపానులుగా మారుతాయని కారల్ మార్క్స్ చెప్పాడు. "పెట్టుబడిదారీ ఉత్పత్తిలో మంచి చెడులతో సంబంధం లేకుండా కొన్ని పరిస్థితులు ఏర్పడతాయి, ఆ పరిస్థితుల్లో కార్మికవర్గం సాపేక్షంగా సంపద్వంతమవుతుంది, కానీ అది చాలా తాత్కాలికమే, వెనువెంట వచ్చే సంక్షోభానికి అది సూచిక మాత్రమే" అని ఆయన పేర్కొన్నాడు. ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థలో మరో సంక్షోభపు పెనుతుపాను ప్రారంభమైందని ప్రపంచ ఆర్థిక, రాజకీయ, సామాజిక, సాంస్కృతిక పరిణామాలన్నీ చెబుతున్నాయి. అయితే పాలక వర్గాలు ఎట్టి పరిస్థితుల్లోనూ తమ గరిష్ట లాభాలను వదులుకోడానికి సిద్ధపడవు. సంక్షోభ భారాలను శ్రామిక ప్రజల మీదకు నెట్టేసి తమ గరిష్ట లాభాలను కాపాడుకోడానికి సంక్షోభ కాలంలో మరింత ఎక్కువగా ప్రయత్నిస్తాయి. ప్రపంచ వ్యాపితంగా నేడు జరుగుతున్నదదే.

ఆర్థిక సంక్షోభానికి తోడు కరోనా మహమ్మారి వల్ల ప్రపంచంలో పనిచేస్తున్న వారిలో సగం మంది ఉద్యోగాలు కోల్పోయినట్లు అంతర్జాతీయ కార్మిక సంస్థ (ఐఎల్ఓ) అంచనా వేసింది. అసంఘటిత రంగంలో ప్రపంచ వ్యాపితంగా 160 కోట్ల మంది జీవనోపాధి కోల్పోయారు. మొత్తంగా 15.8 కోట్ల నుండి 24.2 కోట్ల ఉద్యోగాలు

పోతాయని ఆసియా అభివృద్ధి బ్యాంకు అంచనా వేసింది. వీటిలో 70 శాతం ఆసియా-పసిఫిక్‌లో పోతాయి. ప్రపంచ కార్మికుల ఆదాయాలు 1.2 లక్షల కోట్ల నుండి 1.8 లక్షల కోట్ల డాలర్ల మధ్య పడిపోతాయి. నిరుద్యోగం వల్ల ప్రపంచ వ్యాపితంగా 3.5 నుండి 6 కోట్ల మంది ప్రజలు నిష్టదారిద్ర్యంలోకి దిగజారిపోయినట్లు అంతర్జాతీయ సంస్థలు అంచనా వేశాయి.

అదే సమయంలో ప్రపంచలోని మహా ధనవంతుల (డాలరు శతకోటీశ్వరుల) సంపద కరోనా కాలంలోనే అత్యధికంగా 10.2 లక్షల కోట్ల డాలర్లు (సుమారు 765 లక్షల కోట్ల రూపాయలు) కు పెరిగిందని స్విస్ బ్యాంకు యుబిఎస్ తెలిపింది. అంతకు ముందు 2017 చివరిలో అత్యధిక స్థాయిలో 8.9 లక్షల కోట్లుగా ఉండేది. 2020లో కరోనా తీవ్రంగా ఉన్న ఏప్రిల్, జులై మాసాల్లోనే వారి సంపద 27.5 శాతం పెరిగింది. డాలరు శతకోటీశ్వరుల సంఖ్య కూడా 2017లో 2,158 నుండి కరోనా కాలంలో 2,189కి పెరిగిందని యుబిఎస్ బ్యాంకు తెలిపింది.

1980వ దశకంలో అట్టహాసంగా ప్రకటించిన నయా-ఉదారవాద విధానాలు పెట్టుబడిదారీ వ్యవస్థలోని అన్ని సమస్యలకూ సర్వరోగనివారిణిగా ప్రచారం చేసుకున్నారు. కానీ, మూడు దశాబ్దాలు గడిచేసరికి ఆ విధానాల డొల్లతనం ప్రస్తుత ఆర్థిక సంక్షోభ రూపంలో బయటపడింది. 2008లో అమెరికా సబ్‌ప్రైమ్ సంక్షోభంతో ఈ వైఫల్యం బట్టబయలైంది. నేటికీ ఆ సంక్షోభం కొనసాగుతూ ఉండడమేగాక రానురాను మరింత తీవ్రమవుతోంది. కానీ, పెట్టుబడిదారీ వర్గానికి ప్రత్యామ్నాయం కనుచూపుమేరలో కానరావడం లేదు. అందుకే అవే పాచిపోయిన నయా-ఉదారవాద విధానాలనే కొనసాగిస్తున్నాయి. ప్రజలను మరింత నిష్ట దారిద్ర్యంలోకి నెడుతున్నాయి.

భారత దేశంలో నరేంద్ర మోడీ ప్రభుత్వ కార్పొరేట్ అనుకూల నయా-ఉదారవాద విధానాల వల్ల దేశం కరోనాకు ముందే మాంద్యంలోకి జారుకున్నది. పారిశ్రామికోత్పత్తి అంతకు ముందు ఎనిమిదేళ్లలో ఎన్నడూ లేనంత దిగువకు పడిపోయింది. జిడిపి 4.2 శాతానికి దిగజారిపోయింది. నిరుద్యోగం అర్ధశతాబ్దంలో ఎన్నడూ లేనంత అధిక స్థాయికి చేరుకుంది. కరోనా మహమ్మారిని అరికట్టడంలో మోడీ ప్రభుత్వ అసమర్థత వల్ల పరిస్థితి మరింత దిగజారింది.

ప్రజలకు నేరుగా నగదు బదిలీ చేయాలని, ఉచితంగా ఆహారధాన్యాలు పంపిణీ చేయాలని ఆర్థిక వేత్తల నుండి వస్తున్న డిమాండును ప్రధాని మోడీ, కేంద్ర ప్రభుత్వం పట్టించుకోలేదు. అలా చేసినట్లయితే, దేశీయ గిరాకీ పెరిగి ఆర్థిక వ్యవస్థ పుంజుకోవడం తేలికయ్యేది, ఇప్పుడు ప్రజలనుభవిస్తున్న ఆర్థిక బాధల నుండి బయటపడేవారు. ఇది రెండు రకాలుగా ప్రజలకు, ఆర్థిక వ్యవస్థకు కూడ ఉపయోగపడేది. కానీ, కార్పొరేట్ సేవలోనే నిండా మునిగిపోయిన మోడీ ప్రభుత్వానికి ఈ సూక్ష్మం అర్థం కావడంలేదు.

ఇటీవలి ఆక్స్‌ఫాం నివేదిక వెల్లడించిన వివరాల ప్రకారం మహమ్మారి కాలంలో భారత దేశంలోని శతకోటీశ్వరుల సంపద 35 శాతం పెరిగింది. ఈ కాలంలో భారత దేశంలోని మొదటి 100 మంది శతకోటీశ్వరుల సంపద దాదాపు రు. 13 లక్షల కోట్లు పెరిగింది. దీనికి పూర్తి భిన్నంగా లాక్‌డౌన్ కాలంలో 12.5 కోట్ల మంది తమ ఉద్యోగాలను కోల్పోయారు. 2020 ఏప్రిల్‌లో గంటకు 1,70,000 మంది చొప్పున నిరుద్యోగులయ్యారు.

ఒకవైపున ఆర్థిక సంక్షోభం, ఉపాధి కోల్పోవడంతో పాటు, అన్ని నిత్యావసర సరుకుల, ప్రత్యేకించి పెట్రోలియం ఉత్పత్తుల ధరలు దారుణంగా పెరగడం ప్రజలనుభవిస్తున్న దుర్భర పరిస్థితిని మరింత తీవ్రం చేస్తున్నది. ముడి చమురు అంతర్జాతీయ ధర 2013లో 109 డాలర్లు ఉంటే, 2021 నాటికి అది 53 డాలర్లుకు తగ్గింది. ఇదే సమయంలో ఆర్థిక సంక్షోభం మూలంగా ముడి చమురు దిగుమతులు కూడ తగ్గాయి. అయినప్పటికీ నరేంద్ర మోడీ ప్రభుత్వం పెట్రోలియం ఉత్పత్తుల ధరలను చాలా దారుణంగా పెంచేస్తున్నది. ఇంధన ధరలు ఇంతగా పెరగడంవల్ల రవాణా ఖర్చులు విపరీతంగా పెరిగాయి. ఇది ద్రవ్యోల్బణం మరింత పెరగడానికి దారితీసింది. ఆహార ధరలు కూడ పెరిగి, ప్రజల పరిస్థితి మరింత దుర్భరంగా మారింది. ప్రపంచంలో ఏ దేశంలోనూ లేనంత స్థాయిలో నేడు భారత దేశంలో పెట్రోలియం ఉత్పత్తులపై పన్నులు విధిస్తున్నారు.

ఇదే సమయంలో ప్రజలు తమ జీవితమంతా కూడబెట్టుకొని, బ్యాంకుల్లో డిపాజిట్ చేసుకున్న మొత్తాలను మోడీ తమ ఆశ్రిత పెట్టుబడిదారులు లూటీ చేసుకోవడానికి అనుమతించారు. మొత్తం బ్యాంకింగ్ వ్యవస్థ అస్థిరమయ్యేందుకు దారితీసే విధంగా, ఈ పెట్టుబడిదారుల రు. 9 లక్షల కోట్ల రుణాలను రద్దుచేశాడు.

భారతీయ వ్యవసాయాన్ని విదేశీ, స్వదేశీ కార్పొరేట్ రాబందులకు ఆహారంగా వేయడానికి నరేంద్ర మోడీ ప్రభుత్వం చట్టాలు చేసింది. ఈ చట్టాలు మన దేశ ఆహార స్వయం సమృద్ధిని, దానిలో కీలకపాత్ర పోషించే ప్రభుత్వ ధాన్యసేకరణ విధానాన్ని, దానిపై ఆధారపడి జరిగే ప్రజాపంపిణీని నాశనం చేస్తాయి.

మోడీ ప్రభుత్వ హయాంలో తారాస్థాయికి చేరిన ఆశ్రిత పెట్టుబడిదారీ విధానం ప్రజల వద్ద ఏమీ మిగల్చలేదు. భూములు, గనులు, అడవులు, అంతరిక్షంలోని టెలికాం స్పెక్ట్రమ్‌లు అన్నింటినీ కార్పొరేట్లకు అర్పించేస్తున్నారు. అందుకు చట్టాలు ఆటంకంగా ఉంటే ఆ చట్టాలనే మార్చేస్తున్నారు. రాజ్యాంగాన్ని బేఖాతరు చేస్తున్నారు. ఈ విధానాలు సామాజిక న్యాయాన్ని దారుణంగా దెబ్బతీస్తున్నాయి. ప్రజాధనంతో నిర్మించిన లక్షల కోట్ల విలువ చేసే ప్రభుత్వ రంగ సంస్థలను గుండుగుత్తగా అమ్మేస్తున్నారు.

మోడీ ప్రభుత్వం మన ఫెడరల్ రాజ్యాంగం మీద కూడా దాడి చేస్తోంది. రాష్ట్రాల పరిధిలోనికి వచ్చే వ్యవసాయం, ఉమ్మడి జాబితాలోనికి వచ్చే విద్య, కార్మిక సంక్షేమం వంటి అంశాలపై ఏకపక్షంగా చట్టాలు చేసేసి రాష్ట్రాలపై రుద్దుతోంది. తాను నిర్దేశించిన నయా-ఉదారవాద విధానాలను అమలు జరిపితేనే రాష్ట్రాలకు అదనపు నిధులిస్తామని మెలిక పెడుతోంది. జిఎస్‌టి ద్వారా రాష్ట్రాల ఆదాయ వనరులను తన గుప్పెట్లోకి తీసుకుంది.

జాతీయోద్యమ వారసత్వంగా మనకు సంక్రమించిన కార్మిక, ప్రజాస్వామిక హక్కుల, లౌకిక వ్యవస్థ, సామాజిక న్యాయం...అన్నీ ఈ సంక్షోభ కాలంలో కాలరాయబడుతున్నాయి. మరోపక్క గత 75 సంవత్సరాలలో సాధించుకున్న కొద్దిపాటి ఆర్థిక స్వావలంబన, ఆహార భద్రత సైతం గాలిలో కలిసిపోతున్నాయి. ఎన్నికల వ్యవస్థను కార్పొరేట్ ధన ప్రవాహం అపహాస్యం చేస్తున్నది. జాతీయ దురహంకారం, మతవిద్వేషం దేశభక్తి ముసుగులో చెలామణి అవుతున్నాయి.

ప్రభుత్వం నుండి ఏక కాలంలో తీవ్రతరమైన ఈ దాడులు దేశంలోని కార్మిక, రైతాంగ ఇతర శ్రామిక వర్గాలన్నీ ఏకమై ఎదిరించాల్సిన అనివార్య పరిస్థితులను కూడా కల్పిస్తున్నాయి. సిఎఎ-ఎన్ఆర్‌సి కి వ్యతిరేకంగా దేశవ్యాపితంగా మతాలకు అతీతంగా ఇటీవలి కాలంలో కనీవిని ఎరుగని రీతిలో అపూర్వమైన నిరసనలు జరిగాయి. మరోవైపు ట్రేడ్ యూనియన్లు సంయుక్తంగా ఇచ్చిన అఖిల భారత బంద్ గతంలో

కన్నా పెద్ద ఎత్తున విజయవంతమైంది. బంద్‌లో కార్మికులకుతో రైతులు, వ్యవసాయ కార్మికులు, విద్యార్థులు భుజం భుజం కలిపి పాల్గొన్నారు. వివిధ సెక్షన్లకు చెందిన 25 కోట్ల మంది కార్మికులు, ప్రజలు సమ్మెలో పాల్గొన్నారు. వ్యవసాయ చట్టాలకు వ్యతిరేకంగా నాలుగు మాసాలుగా దేశ రైతాంగం ఢిల్లీలో చారిత్రాత్మకమైన పోరాటం చేస్తోంది. మోడీ ప్రభుత్వ ప్రయివేటీకరణకు వ్యతిరేకంగా బ్యాంకులు, ఎల్‌ఐసి, జిఐసి ఉద్యోగులు విశాఖపట్నం స్టీలు కార్మికులు పెద్ద ఎత్తున పోరాటానికి దిగారు. రాను రాను మరిన్ని సెక్షన్ల శ్రామిక ప్రజలు ఉద్యమాల్లోకి వచ్చే పరిస్థితులు కనిపిస్తున్నాయి.

సంక్షోభ కాలంలో ప్రజల మీద దాడులు పెరగడమే కాదు, ప్రజలు ఉవ్వెత్తున తిరగబడి చరిత్ర తిరగరాసే అవకాశాలూ పెరుగుతాయి. మార్పులు తీవ్రమైన వేగంతో సంభవిస్తాయి. అభ్యుదయ శక్తులు ఈ సంక్షోభ స్వరూపాన్ని సక్రమంగా అవగతం చేసుకుని సరైన సమయంలో, తగినంత వేగంతో జోక్యం చేసుకోవాల్సి ఉంటుంది. అన్ని విధాలుగా విఫలమైన పెట్టుబడిదారీ వ్యవస్థ స్థానే మెరుగైన ప్రత్యామ్నాయ వ్యవస్థను, దోపిడీ లేని సమసమాజాన్ని నిర్మించుకునే దిశగా ముందడుగులు ఆక్రమంలోనే పడతాయి.

2008లో ప్రారంభమై ప్రపంచ పర్యవ్యాప్తమైన ఈ ఆర్థిక సంక్షోభం గురించిన అన్ని కోణాలలోనూ నిత్యం అత్యంత ప్రతిభావంతంగా విశ్లేషిస్తున్న ఆర్థిక వేత్త ప్రొఫెసర్ ప్రభాత్ పట్నాయక్. ఆర్థిక సంక్షోభం, దానికితోడు కరోనా మహమ్మారి నేపథ్యంలో ప్రపంచ, భారత ఆర్థిక వ్యవస్థలు నడుస్తున్న తీరుతెన్నులు, నడవాల్సిన మార్గాలను సూచిస్తూ ఆయన గత రెండు సంవత్సరాలుగా "పీపుల్స్ డెమోక్రసీ" పత్రికలో అనేక వ్యాసాలు రాశారు. వాటిని "ప్రజాశక్తి" దిన పత్రిక సంపాదకులు ఎంవిఎస్ శర్మ అత్యంత సరళంగా తెనిగీకరించారు. ప్రజాశక్తి పత్రికలో క్రమం తప్పకుండా ప్రచురించబడిన వ్యాసాలను మూడు భాగాలుగా విడదీసి మూడు పుస్తకాలుగా ప్రజాశక్తి ప్రచురణ సంస్థ మీ ముందుకు తెస్తోంది. ఈ పుస్తక త్రయంలో మొదటిది ప్రపంచ ఆర్థిక సంక్షోభాన్ని గురించి వివరిస్తే రెండోది భారత ప్రభుత్వ, ముఖ్యంగా మోడీ ప్రభుత్వ దివాళాకోరు ఆర్థిక విధానాల వల్ల పతనమవుతున్న దేశ ఆర్థిక పరిస్థితిని గురించి వివరిస్తుంది. మూడోభాగం ఈ ఆర్థిక సంక్షోభంలో భాగంగా దేశంలో తలెత్తిన చారిత్రాత్మక రైతాంగ ఉద్యమం గురించి విశ్లేషిస్తుంది.

ఈ మూడు పుస్తకాలు దేనికదే ఒక అంశాన్ని వివరిస్తున్నప్పటికీ మూడింటినీ కలిసి చదవడం వల్ల నేటి ప్రపంచ ఆర్థిక సంక్షోభం, దానిలో భాగంగా భారత దేశ ఆర్థిక పరిస్థితి, దాని నుండి తలెత్తిన ఉద్యమాల గురించి పాఠకులకు లోతైన అవగాహన కలుగుతుంది. ఈ నాటి సంక్షుభిత ప్రపంచాన్ని గురించి అర్థం చేసుకోవాలంటే ఆర్థిక పునాదిలో జరుగుతున్న ఘర్షణ గురించి అవగాహన ఉండాలి. అలాగే నేడు దేశంలో జరుగుతున్న చారిత్రాత్మక రైతాంగ ఉద్యమం గురించి అవగాహన చేసుకోవాలంటే దాని వెనుక నున్న ఆర్థిక శక్తుల సంఘర్షణ గురించి అర్థం చేసుకోవాలి. సామాన్య ప్రజలు కూడా సులభంగా అర్థం చేసుకోగలిగే విధంగా రాయబడ్డ, స్వేచ్ఛానువాదం చేయబడ్డ ఈ మూడు పుస్తకాలను చదవడమే కాకుండా పదిమందితో చదివిస్తారని ఆశిస్తున్నాం.

ఎస్.వెంకట్రావు,

16.3.2021

# సంక్షోభంలో పెట్టుబడిదారీ వ్యవస్థ

ప్రస్తుతం పెట్టుబడిదారీ వ్యవస్థ సంక్షోభంలో ఉంది. ఉత్పత్తి బాగా తగ్గిపోవడం, నిరుద్యోగం అవధులు దాటి పెరిగిపోవడం దీని పర్యవసానాలే. అయితే చాలామంది ఈ సంక్షోభం కోవిడ్-19 కారణంగానే ఏర్పడిందని అనుకుంటున్నారు. కోవిడ్-19 గనక అదుపులోకి వచ్చేస్తే తిరిగి సాధారణ పరిస్థితులు వచ్చేస్తాయని భావిస్తున్నారు. ఈ అభిప్రాయం పూర్తిగా తప్పు. ఈ కోవిడ్-19 రాకమునుపే ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థ మందగించడం మొదలైందన్నది మొదట మనం గుర్తించాల్సిన వాస్తవం. ఇంకా చెప్పాలంటే 2008 లో "రియల్ ఎస్టేట్ రంగం వృద్ధి" బుడగ పేలిపోయి ఆర్థిక సంక్షోభం ఏర్పడిన తర్వాత ఆర్థిక వ్యవస్థ ఇంతవరకూ పూర్తిగా కోలుకోనేలేదు. కొద్దిగా పుంజుకోవడం, మళ్లీ వెంటనే పడిపోవడం జరుగుతూనే వుంది. అమెరికాలో ట్రంప్ గొప్పగా నిరుద్యోగిత రేటు తక్కువగా ఉందని చెప్పుకున్నాడు. కాని నిజానికి 2008కి ముందు కాలంలో పని దొరికిన రోజుల కన్నా ఆ తర్వాత కాలంలో తక్కువ రోజులు పని లభించింది. దానిని కూడా పరిగణనలోకి తీసుకుంటే అమెరికాలో అధికారికంగా చెబుతున్న 4 శాతం నిరుద్యోగం కన్నా వాస్తవ నిరుద్యోగం 8 శాతం పైనే ఉంది. ఇది 2020లో కరోనా వ్యాపించక ముందున్న పరిస్థితి.

ఆర్థిక వ్యవస్థ మందగించడానికి కారణం ఏమిటి? ఉత్పత్తిలో వచ్చే మిగులులో కార్మికుల వాటా తగ్గిపోయి, పెట్టుబడిదారుల వాటా పెరుగుతూ వచ్చింది. ఒకవైపున సాంకేతికాభివృద్ధి ఫలితంగా కార్మికుల ఉత్పాదకత బాగా పెరుగుతూ వచ్చింది. కాని ఆ కార్మికుల నిజవేతనాల స్థాయి మాత్రం అందుకు తగినట్టు పెరగకుండా యథాతథంగా కొనసాగుతూ వచ్చింది. అందువలన ఉత్పత్తిలో వేతనాల వాటా తగ్గుతూ, లాభాల వాటా పెరుగుతూ వచ్చింది. ఇదంతా నయా ఉదారవాద విధానాల పుణ్యమే. ఎప్పుడైతే వేతనాల వాటా... పెరిగిన ఉత్పత్తికి తగినట్టు పెరగలేదో... అప్పుడు ఆ ఉత్పత్తులను కొనుగోలు చేసే విధంగా డిమాండ్ పెరగదు. పెట్టుబడిదారుడి

లాభం పెరిగినంత మాత్రాన అతడు దానినంతటినీ ఖర్చు చేయడు. మరోవైపు కార్మికుల వేతనాల వాటా పెరగనందున వారు కొనుగోలు చేయగల శక్తి తగ్గిపోతుంది (పెరిగిన ఉత్పత్తితో పోల్చితే). పర్యవసానంగా ఆర్థిక మాంద్యం ఏర్పడింది. ఇది పెట్టుబడిదారీ ప్రపంచం అంతటా కరోనా రావడానికి ముందే నెలకొన్న పరిస్థితి.

ఇప్పుడు కరోనా వచ్చి ఈ పరిస్థితిని మరింత తీవ్రంగా మార్చింది. అయితే, కరోనా అదుపులోకి వచ్చాక కూడా ప్రపంచంలో కొనుగోలు శక్తి తగినంత లేని పరిస్థితి అలానే ఉంటుంది (నిజానికి అది నానాటికీ మరింత జటిలం అవుతుంది కూడా). ఈ స్థితి నుండి బైట పడాలంటే ప్రభుత్వం చేసే ఖర్చును పెంచాల్సి వుంటుంది. ఆ అదనపు ఖర్చు కోసం అవసరమైన సొమ్ము పెట్టుబడిదారులపై అదనపు పన్నులను విధించి గాని, ద్రవ్యలోటును పెంచి గాని సమకూర్చుకోవాలి. కార్మికుల మీద, ప్రజలమీద భారం మోపడం వలన ఉపయోగం ఉండదు. కార్మికులు ఎటుతిరిగీ వారి ఆదాయాలను ఖర్చు చేస్తారు. వారి దగ్గర నుండి పన్ను రూపంలో ప్రభుత్వం తీసుకుని ఖర్చు చేస్తే డిమాండ్ పెరిగేదేమీ ఉండదు. సంక్షోభం తగ్గేదీ ఉండదు. కాని ఫైనాన్సు పెట్టుబడి ప్రభుత్వం అదనపు ఖర్చు చేయడానికి అంగీకరించదు. అంటే కరోనా తగ్గిన తర్వాత కూడా ప్రభుత్వాలు ప్రజల కొనుగోలుశక్తిని పెంచేందుకు ఎట్టి చర్యలూ చేపట్టడం జరగదు. నయా ఉదారవాదం పెట్టుబడిదారీ వ్యవస్థను దారితోచని స్థితికి తెచ్చింది. కరోనా అనంతరం, నిబంధనలు సడలించాక వినిమయ వస్తువుల కొనుగోలు పెరుగుతుందని అనుకున్నా, సరుకుల ఉత్పత్తికి పెట్టే పెట్టుబడులు మాత్రం కరోనాకు ముందున్న పాత స్థితికి చేరుకోవు. అంటే వినిమయ వస్తువుల ఉత్పత్తి కూడా పాత స్థితికి చేరుకోదు. అంతకన్నా తక్కువ స్థాయి లోనే ఉంటుంది. కరోనా మహమ్మారి వంటి ఒక "షాక్" తగిలాక ఈ విధంగానే ఉంటుంది.

ఒక చిన్న లెక్క సహాయంతో దీనిని అర్థం చేసుకోవచ్చు. కరోనాకు ముందు మన ఆర్థిక వ్యవస్థ 2 శాతం చొప్పున ప్రతి ఏడూ వృద్ధి చెందుతోందనుకుందాం. అప్పుడు పెట్టుబడిదారుడు తన పెట్టుబడిని కూడా ప్రతి ఏడూ 2 శాతం చొప్పున పెంచుతూవస్తాడు. అతడి పెట్టుబడి విలువ రూ. 500 అనుకుందాం. ఉత్పత్తి అయ్యే సరుకు విలువ రూ. 100 అనుకుందాం. మార్కెట్ లోకి రూ.100 విలువ గల సరుకు వస్తుంది.

ఉత్పత్తి విలువ రూ. 100 అనుకున్నాం. దీనిని పంచుకునేది పెట్టుబడిదారుడు (లాభం పేరుతో), కార్మికులు (వేతనాల పేరుతో), ప్రభుత్వం (పన్నుల రూపంలో). పన్నుల రూపంలో రూ.20 పోయిందనుకుందాం. తక్కిన 80 లో కార్మికులు, పెట్టుబడిదారుడు చెరిసగం పంచుకున్నారనుకుందాం. అంటే కార్మికులకు రూ. 40,

పెట్టుబడిదారుడికి రూ. 40 వస్తాయి. ప్రభుత్వం వాటా రూ. 20, కార్మికుల వాటా రూ. 40 పూర్తిగా ఖర్చు చేస్తారు. పెట్టుబడిదారుడి వాటాలో రూ. 30 మాత్రమే ఖర్చు చేస్తాడు (తక్కిన రూ. 10 అతను అదనపు పెట్టుబడిగా పెడతాడని ముందే అనుకున్నాం). కరోనా అనంతరం వినిమయం స్థాయి పూర్వ స్థితికి చేరుకోగలిగిందని అనుకున్నా దాని వలన మార్కెట్‌లో ఇప్పుడున్న సరుకు అమ్ముడుపోవడానికి అది వీలు కలిగిస్తుంది. కాని ఈ సారి పెట్టుబడిదారుడు వృద్ధిరేటు గతంలో మాదిరిగానే కొనసాగుతుందని అనుకోలేడు గనుక గతంలో పెట్టిన స్థాయిలో 2 శాతం పెట్టుబడి అదనంగా పెట్టడు. సగానికి తగ్గించి ఒక్క శాతమే (అంటే 5) మాత్రమే పెట్టుబడి పెట్టి మార్కెట్‌లో ఏం జరుగుతుందో పరిశీలిస్తూ ఉంటాడు.

అదనపు పెట్టుబడి సగానికి తగ్గడం వలన ఉత్పత్తి వృద్ధి సగానికి తగ్గిపోతుంది. అందువలన దానిని పెట్టుబడిదారుడు లాభంగాను, కార్మికులు వేతనాలుగాను పంచుకున్నప్పుడు వారివారి వాటాలుగా వచ్చేది కూడా సగానికి తగ్గిపోతుంది. ప్రభుత్వం పన్నులను ముందే వసూలు చేస్తుంది కనుక దాని వాటా తగ్గదనుకుందాం. అప్పుడు వినిమయం చేయడానికి ప్రభుత్వ ఖర్చు 20, కార్మికుల వాటా 20 (గతంలో వచ్చిన దానిలో సగం) పెట్టుబడిదారుడి వాటా నుండి ఖర్చు చేసేది 15–మొత్తం 55 మాత్రమే అవుతుంది. అదనపు పెట్టుబడి 5.

ఎప్పుడైతే వినిమయం తగ్గుతుందో అప్పుడు సామర్థ్యాన్ని పూర్తిస్థాయిలో వినియోగించి ఉత్పత్తి చేయడం సాధ్యపడదు. అందుచేత పెట్టుబడిదారీ వ్యవస్థకి వెటలుపలినుంచి కరోనా వంటి షాక్ గనుక తగిలితే కోలుకుని ఉత్పత్తి మామూలు స్థితికి రావడానికి చాలా కాలం పడుతుంది. ఇక కరోనాకు ముందే మాంద్యంలో కూరుకుపోయిన ప్రస్తుత పరిస్థితిలో కోలుకోవడం ఇంకా దీర్ఘకాలం పడుతుంది. గతంలో 1930 దశకంలో మహామాంద్యం వచ్చినప్పుడు అమెరికాలో సరిగ్గా ఇదే జరిగింది. ఆ సంక్షోభం నుంచి బైట పడడానికి రూజ్‌వెల్ట్ ప్రకటించిన న్యూ డీల్ ఫలితంగా ప్రభుత్వం ఖర్చు పెంచింది. దాంతో సరుకుల వినిమయం అయితే పెరిగింది కాని అదే మోతాదులో పెట్టుబడులు, అదనపు ఉత్పత్తి పెరగలేదు. సరిగ్గా ఆ సమయానికి వచ్చిపడిన రెండవ ప్రపంచ యుద్ధం కారణంగా ఆయుధాలకు డిమాండ్ పెరిగింది. అందుచేత ఆయుధ పరిశ్రమలలో పెట్టుబడులు పెరిగాయి. దాంతో పెట్టుబడిదారీ వ్యవస్థకు సంక్షోభం నుండి ఊరట లభించింది. ఆ న్యూ డీల్ ద్వారా ప్రభుత్వం చేసిన ఖర్చు బాగా పెరిగింది. అందువలన వస్తువుల వినిమయం పెరిగింది. కాని ఇప్పటి పరిస్థితుల్లో ద్రవ్య పెట్టుబడి ప్రభుత్వాలను ఖర్చు పెంచుకోడానికి అనుమతించదు. అందుచేత ఈ మారు సంక్షోభ దశలో 1930 దశకంతో పోల్చి

చూసినపుడు వినిమయం తిరిగి పుంజుకోవడానికి కూడా ఇంకా ఎక్కువ సమయమే పడుతుంది. మొత్తం మీద పెట్టుబడిదారీ వ్యవస్థ చాలా కాలం పాటు ఈ సంక్షోభంలో కూరుకుపోయి వుంటుంది.

అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడి ఆదేశాలకు పూర్తిగా తలొగ్గి చెప్పినట్టల్లా చేసే ప్రభుత్వం ఉన్న భారతదేశంలో కోలుకోడానికి మరికాస్త ఎక్కువ సమయమే పడుతుంది. కొనుగోలుశక్తి పెంచే దిశగా ఒక్క చర్యనూ ప్రభుత్వం తీసుకోవడంలేదు. అసలు ఈ సంక్షోభానికి మూల కారణం కొనుగోలుశక్తి తగినంత లేకపోవడమే అన్న విషయం ఈ ప్రభుత్వానికి ఏ మాత్రమూ అర్ధం అయినట్టులేదు. అందువలన మోడీ ప్రభుత్వం చేపడుతున్న చర్యలన్నీ ప్రజల కొనుగోలుశక్తిని మరింత కుంగదీస్తున్నాయి. దాని వలన సంక్షోభం మరింత తీవ్రం అవుతుంటుంది. సంక్షోభం తీవ్రం అవుతున్నకొద్దీ ప్రభుత్వం మరింత నియంతృత్వంగా వ్యవహరిస్తూ, కార్మిక వర్గాన్ని అణచివేస్తూ, వారిని చీల్చడానికి తన మతోన్మాద అజండాను మరింత ఉధృతం చేస్తూపోతుంది.



# మహమ్మారి పీడిత ప్రజలూ: ద్రవ్య పెట్టుబడీ

ప్రస్తుత కాలపు ప్రపంచీకరణ లోని ప్రధాన వైరుధ్యాన్ని కోవిడ్-19 మహమ్మారి మన కళ్లకు కట్టినట్లు స్పష్టంగా చూపిస్తోంది. ద్రవ్య పెట్టుబడి ప్రయోజనాలకూ, సాధారణ ప్రజల ప్రయోజనాలకూ మధ్య ఉండే మౌలిక వైరుధ్యమే ఇప్పుడు ప్రధానంగా ముందుకొచ్చింది. ప్రపంచీకరణ శకం అంతటికీ ఈ వైరుధ్యమే మౌలికమైనది. ఇప్పుడది స్పష్టంగా ముందుకొచ్చింది.

వరుసగా ఒక్కొక్క దేశం లోనూ ఇది బైటపడుతోంది. మన దేశాన్నే తీసుకోండి. ఒక్కసారిగా పదుల లక్షల సంఖ్యలో ఉద్యోగాలు కోల్పోయారు. లక్షలాది వలస కార్మికులు తమ స్వంత గ్రామాలకు దూరంగా ఇన్నాళ్లూ పనులు చేస్తున్న వాళ్లు కాస్తా ఆ పనులు పోవడంతో కాలినడకన వెనక్కి బయలుదేరారు. చాలా మంది క్వారంటైన్‌లో ఉండిపోయారు. వాళ్ల జేబుల్లో చిల్లి గవ్వ లేదు. ఇటువంటి వారిని ఆదుకొని సహాయం అందించాలి. అలా చేయాలంటే ద్రవ్యలోటును పెంచాల్సిందే.

కాని అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడికి ఇలా ద్రవ్యలోటును పెంచడం అంగీకారం కాదు. అందుకే ప్రభుత్వం అలా చేయడం లేదు. కేంద్ర ఆర్థిక మంత్రి ప్రకటించిన సహాయ చర్యల ప్యాకేజీ అత్యంత స్వల్పంగా ఉంది. అందులో కూడా ఇప్పటికే బడ్జెట్‌లో ప్రతిపాదించిన చర్యలు కూడా ఉన్నాయి. వాటిని పక్కనబెట్టి లెక్క వేస్తే కేవలం రూ. 92,000 కోట్లు మాత్రమే సహాయం అందుతుంది. అందులో నగదు రూపంలో అందేది రూ. 34,000 కోట్లు. ప్రజా పంపిణీ వ్యవస్థ ద్వారా ఆహార ధాన్యాల రూపంలో అందేది రూ. 45,000 కోట్లు. వంటగ్యాస్ సిలిండర్ల రూపంలో మరో రూ. 13,000 కోట్లు. ఇదంతా కలిపితే మన దేశ జిడిపిలో 0.5 శాతం మాత్రమే. స్వాతంత్ర్యానంతర కాలంలో మన దేశం ఎప్పుడూ ఎదుర్కోనంత గడ్డు పరిస్థితిని ఇప్పుడు చూస్తున్నాం. ఇటువంటి క్లిష్ట పరిస్థితుల్లో కూడా ఇంత స్వల్పంగా సహాయం ప్రకటించడం చాలా అన్యాయం.

మన ఆర్థిక పరిస్థితి మాటేంటి? 5 కోట్ల 80 లక్షల టన్నుల ఆహారధాన్యాల నిల్వలు మన దగ్గర ఉన్నాయి. ఖరీఫ్‌లో సేకరించిన పంట ఇంకా పంపిణీకి సిద్ధం కాలేదు. దానితో కలిపితే ఏకంగా 7 కోట్ల 70 లక్షల టన్నులు! ప్రస్తుతం రబీ పంట కూడా బాగా పండింది. పారిశ్రామిక రంగమేమో డిమాండ్ కొరతతో కునారిల్లుతోంది. పూర్తి స్థాపక సామర్థ్యం కన్నా చాలా దిగువ స్థాయి లోనే ఉత్పత్తి జరుగుతోంది. నిజానికి ఈ కోవిడ్-19 మహమ్మారి వ్యాపించక ముందే మనం పారిశ్రామిక మాంద్యంలోకి జారిపోవడం మొదలైంది. ఇక విదేశీ మారక నిల్వలు చూస్తే రికార్డు స్థాయిలో 50,000 కోట్ల డాలర్లు పోగుబడి వున్నాయి (అంటే సుమారు రూ.38 లక్షల కోట్లు)! ఈ పరిస్థితుల్లో ద్రవ్యలోటు భారీగా పెరిగినా దేశ ఆర్థిక వ్యవస్థకొచ్చే ముప్పేమీ లేదు. కాని అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడి ఇందుకు అంగీకరించదు. ఆ కారణంగానే ప్రజలు ఇంత తీవ్రంగా ఇబ్బందులు పడుతున్నారు.

ద్రవ్యలోటు గనుక పెరిగితే అంతర్జాతీయ రేటింగ్ ఏజెన్సీలు భారత దేశపు రేటింగ్‌ను తగ్గించేస్తాయి. రేటింగ్ తగ్గిపోతే మన దేశంలో మదుపులు పెట్టే వారి విశ్వాసం సన్నగిల్లిపోతుంది. అప్పుడు వాళ్లు ఈ దేశం నుండి తమ పెట్టుబడులను మరో దేశానికి తరలించుకుపోతారు. దాని పర్యవసానంగా రూపాయి విలువ మరింత పడిపోతుంది. అప్పుడు ద్రవ్యోల్బణం పెరిగిపోతుంది. ఇదీ అధికార వర్గాలకున్న భయం. అయితే ఇక్కడ వాళ్లు ఒక విషయాన్ని విస్మరిస్తున్నారు. అటువంటి పరిస్థితే (పెట్టుబడులను మరో దేశానికి తరలించుకుపోయే పరిస్థితి) గనుక వస్తే మన ప్రభుత్వం ఆ పెట్టుబడుల తరలింపుపై ఆంక్షలు విధించవచ్చు. ప్రస్తుత సంక్లిష్ట పరిస్థితుల్లో ఎవరైనా అటువంటి చర్యలతో నియంత్రించవచ్చు. కాని మన 'హిందూత్వ' ప్రభుత్వం మాత్రం ఆ సాహసం చేయలేకపోతోంది.

ఇటువంటి సంక్లిష్ట పరిస్థితుల్లో సైతం ప్రభుత్వాన్ని కదలనీయకుండా కాళ్లు, చేతులు కట్టేసేటటువంటి పట్టు అంతర్జాతీయ ద్రవ్యపెట్టుబడి కలిగివుండడం ఏమిటి? మన ప్రభుత్వానికి ఈ సంగతి తోచదు. అందుకే ఇటువంటి అసాధారణ పరిస్థితుల్లో కూడా పెట్టుబడుల రాకపోకలను నియంత్రించవచ్చన్న ప్రయత్నమే చేయకుండా వుంది. ద్రవ్యలోటు పెరిగి, క్రెడిట్ రేటింగ్ తగ్గితే ఆ తర్వాత కదా పెట్టుబడులు తరలిపోయే సమస్య తలెత్తుతుంది. కాని ఆ ఆలోచన చెయ్యడానికే భయపడిపోతున్న మోడీ ప్రభుత్వం ద్రవ్యపెట్టుబడిని సంతృప్తిపరచడం కోసం ప్రజల ప్రయోజనాలను బలిపెడుతోంది.

అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడిని ఎదిరించి మాట్లాడలేని కేంద్ర ప్రభుత్వపు పిరికితనం రాష్ట్ర ప్రభుత్వాల కాళ్లూ చేతులూ కట్టిపడేస్తోంది. ఈ మహమ్మారిని అరికట్టేందుకు అయ్యే వ్యయంలో గణనీయమైన భాగాన్ని రాష్ట్రాలే భరించాలి. కాని బిజెపి ప్రభుత్వ హయాంలో ఆర్థిక వనరుల కేంద్రీకరణ అంతకంతకూ పెరుగుతోంది.

జిఎస్‌టి విధానం వచ్చాక ఏ రాష్ట్రమూ ఏ సరుకు మీదా జిఎస్‌టి కౌన్సిల్ అనుమతి లేకుండా పన్ను విధించలేదు. ఆ కౌన్సిల్ మీద కేంద్రానికి పెత్తనం. అందువలన కేంద్రం నుండి వచ్చే నిధుల పైనే రాష్ట్రాలన్నీ ఆధారపడవలసి వస్తోంది.

చివరకు రాష్ట్రాలు ఏ మోతాదులో అప్పులు తేవొచ్చు అన్నది కూడా కేంద్రం అదుపులోనే ఉంది. అందుచేత కేంద్రం దగ్గర నిధులు లేకపోతే రాష్ట్రాల దగ్గరా ఉండవు. కేంద్రం అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడికి లొంగి వుంటే రాష్ట్రాలూ లొంగి వుండాల్సి వస్తోంది. పై నుంచి కింది వరకు అన్ని స్థాయిల్లోనూ ప్రజల ఇబ్బందుల్ని తొలగించడం కోసం ప్రభుత్వాలు తగినంత మోతాదులో ఖర్చు చేయనీయకుండా అడ్డు పడుతున్నది కేంద్ర ప్రభుత్వపు ఈ పిరికితనమే.

ఇదే రకమైన ఘర్షణ యూరప్ లోనూ కనబడుతోంది. దక్షిణ యూరప్ లోని దేశాలు, ముఖ్యంగా ఇటలీ, స్పెయిన్ ఈ మహమ్మారి వల్ల బాగా దెబ్బతిన్నాయి. ఏ దేశానికి ఆదేశం ఈ పరిస్థితిని ఎదుర్కోవడానికి అవసరమైన ఆర్థిక వనరులు సమకూర్చుకోవాలంటే ఎక్కువ వడ్డీ చెల్లించుకోవాలి. అందుచేత యూరో దేశాలన్నీ కలిపి ఉమ్మడిగా రుణాల కోసం బాండ్లు విడుదల చేస్తే వాటిపై చెల్లించే వడ్డీ తగ్గుతుందని కొన్ని దేశాలు ప్రతిపాదించాయి. అంటే ఇటలీ కోసం, స్పెయిన్ కోసం, మొత్తం యూరో దేశాలన్నీ కలసి ఉమ్మడిగా అప్పు తేవాలి.

ఈ ప్రతిపాదన చేసింది ఇటలీ. కాని జర్మనీ, నెదర్లాండ్స్ దీనికి ఒప్పుకోలేదు. యూరో జోన్‌లో జర్మన్ ద్రవ్య పెట్టుబడిదే సింహభాగం. ఏ దేశానికి ఆ దేశం అప్పు చేసి దాని పర్యవసానాలు ఎదుర్కోవాలే తప్ప ఆ సమస్యను అన్ని దేశాలూ కలిసి ఉమ్మడిగా ఎదుర్కోవాలన్న ఆలోచనను జర్మనీ తిరస్కరించింది. ఏ దేశానికి అప్పు అవసరమో ఆ దేశపు ద్రవ్యలోటు పెరుగుతుంది. దాని పర్యవసానాలను ఆ దేశమే భరించాలి తప్ప తక్కిన దేశాలు ఎందుకు భరించాలి అన్నది జర్మనీ వాదన. ఈ వాదనను జర్మన్ ద్రవ్యపెట్టుబడి తరపున ముందుకు తెస్తున్న జర్మనీ అధినేత ఏంజెలా మెర్కెల్ ఇదే రకమైన వాదనను గతంలో గ్రీస్ దేశ సంక్షోభ సమయం లోనూ జర్మనీ చేసింది. ఆ దేశపు అప్పుల్ని రీ షెడ్యూల్ చెయ్యడానికి సుతరామూ ఒప్పుకోలేదు. ఈ విషయంలో వెనక్కి తగ్గాలని అంతర్జాతీయ ఆర్థిక నిపుణులు, మేధావులు ఏంజెలా మెర్కెల్‌ను అభ్యర్థించారు. వందేళ్ల క్రితం మొదటి ప్రపంచ యుద్ధం అనంతరం 'వర్సెయిల్స్ సంధి' ద్వారా జర్మనీపై కఠినమైన ఆంక్షలను విధించడం వలన అక్కడ నాజీయిజం ప్రబలడానికి అది ఏవిధంగా దోహదం చేసిందీ వారు ఈ సందర్భంగా గుర్తు చేశారు (కొమింటర్న్ రెండో మహాసభలో తన ప్రసంగంలో ఈ ఆంక్షలు గురించి ప్రస్తావిస్తూ అది ప్రపంచంలో విప్లవాలు బద్దలవుతాయన్న దానికి ఏవిధంగా సంకేతమో లెనిన్ వివరించాడు). కాని ద్రవ్యపెట్టుబడి ఈ విజ్ఞప్తులకు ఏమాత్రం చలించడం లేదు.

ప్రస్తుతం ఈ మహమ్మారి తాకిడి నేపథ్యంలో పలు మూడో ప్రపంచ దేశాలు తమ రుణాలను రీ షెడ్యూల్ చేయవలసింది గాను, కొత్తగా రుణాలు ఇవ్వవలసింది గాను కోరుతున్నాయి. ఐఎంఎఫ్ స్వంత ఆర్థిక వనరులు చాలా తక్కువ. అందువల్ల మహమ్మారి బాధితులకు సహాయం కోసమూ, తనకు ఆర్థిక వనరులను సమకూర్చిన ద్రవ్య సంస్థల ప్రయోజనాల కోసమూ-రెండింటికీ సరిపడా నిధులు ఐఎంఎఫ్ సమకూర్చగలిగిన స్థితిలో లేదు. అందుచేత ఐఎంఎఫ్ చేయబోయే రుణాల రీ షెడ్యూలింగ్ వలన కార్మికులకు, పేదలకు సహాయం అందించగలిగే అదనపు వనరులు ఏమీ రావు.

ఆ విధంగా ద్రవ్య పెట్టుబడికి, మహమ్మారి పీడిత ప్రజలకి మధ్య వైరుధ్యం తీవ్రమౌతోంది. 'వృద్ధి రేటును పెంచాలి', 'సంపద సృష్టించాలి' వంటి పద ప్రయోగాల మాటున ద్రవ్య పెట్టుబడి దాడి చేస్తోంది. వృద్ధి రేటు పెరిగితే సామాన్యులతో సహా అందరి జీవితాలూ వృద్ధి చెందుతాయన్నట్లు... దేశంలో 'సంపద వృద్ధి' జరిగితే ఆ సంపదలో దేశ ప్రజానీకం యావత్తూ వాటాలు పొందుతారన్నట్లు అభిప్రాయాలు కలిగిస్తారు. దేశ ప్రయోజనాలంటే ద్రవ్య పెట్టుబడి ప్రయోజనాలే అన్నట్లు, ఆ ద్రవ్య పెట్టుబడి ప్రయోజనాలను కాపాడడమే నిజమైన దేశ సేవ అన్నట్లు ప్రచారం చేస్తారు.

అయితే నానాటికీ పెరుగుతున్న ఆర్థిక సంక్షోభ తీవ్రతలో ఇలాంటి ప్రచారాలు, వాదనలు ఎక్కువసేపు నిలవవు. వడ్డీ రేట్లు తగ్గించినంత మాత్రాన ప్రపంచం సంక్షోభం నుండి కోలుకోదు. ప్రజలకు నేరుగా ఆర్థిక సహాయాన్ని పెద్ద ఎత్తున చేయాలి. ఇందుకోసం ద్రవ్యలోటును పెంచక తప్పదు. అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడి చట్రం లోపలే వుంటూ ఇటువంటి ఆర్థిక సహాయం అందించడం ఏ ప్రభుత్వం వల్లా కాదు. ఒకవేళ అలా చేస్తే దేశం నుండి పెట్టుబడులు విదేశాలకు తరలిపోయే ప్రమాదం ఉంటుంది.

అంటే ద్రవ్య పెట్టుబడి ప్రయోజనాలు ప్రజల ప్రయోజనాలకు పూర్తి వ్యతిరేకం. ఈ మహమ్మారి వల్ల ఏర్పడిన పరిస్థితులు ఆ సంగతిని స్పష్టం చేస్తున్నాయి. ఈ వాస్తవాన్ని ఏవో పదాల ముసుగులో కప్పి పుచ్చడం ఇంక ఎంత మాత్రమూ సాధ్యం కాదు. తక్షణమే ప్రజలను ఆదుకోవాల్సిన కర్తవ్యం ముందు నిలుచుని వుంది. దాన్ని నెరవేర్చడానికి ప్రధాన ఆటంకంగా అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడి వుంది. ఈ వైరుధ్యం ముదిరి రాబోయే కాలంలో అంతర్జాతీయ పెట్టుబడి ఆధ్వర్యం లోని ప్రపంచీకరణకు చావు గంట మోగిస్తుంది.



# లెబనాన్ సంకేతాలు

లెబనాన్‌లో ప్రస్తుతం జరుగుతున్న పరిణామాలు యావత్తు మూడో ప్రపంచ దేశాలకూ రాబోయే రోజుల్లో ఎదురవనున్న ప్రమాదాన్ని సూచిస్తున్నాయి. లెబనాన్ ఒక చిన్న దేశం. ఎక్కువగా దిగుమతులపై ఆధారపడివున్న దేశం. ప్రపంచ వ్యాప్తంగా ఆర్థిక మాంద్యం ముసురుకొని వుండడంతో బాటు కరోనా మహమ్మారి విజృంభించిన కారణంగా మరింత ముదిరిన ఆర్థిక సంక్షోభం లెబనాన్‌పై కొన్నాళ్ళుగా తీవ్ర ప్రభావాన్ని చూపింది. దేశ ఆర్థిక వ్యవస్థ చాలా దయనీయమైన పరిస్థితిలో పడింది. లెబనాన్‌కు విదేశీ మారకద్రవ్యం ప్రధానంగా టూరిజం ద్వారా, గల్ఫ్ నుండి అక్కడ పని చేసే లెబనాన్ పౌరులు పంపే సొమ్ము ద్వారా వచ్చేది. ఇప్పుడు ఈ కరోనా కారణంగా ఈ రెండు వనరులూ పూర్తిగా నిలిచిపోయాయి. విదేశీ మారకద్రవ్యం కొరత తీవ్రం కావడం, అన్నింటికీ ప్రధానంగా దిగుమతుల పైనే ఆధారపడాల్సిరావడం వలన లెబనాన్ దేశపు కరెన్సీ విలువ చాలా పడిపోయింది. విదేశీ రుణాల చెల్లింపులను చేయలేని స్థితి వచ్చింది. నిత్యావసర సరుకుల కోసం కూడా దిగుమతుల పైనే ఆధారపడవలసిరావడంతో వాటికి కొరత ఏర్పడి ప్రజానీకం నానా అవస్థలూ పడుతున్నారు. మరోవైపు ధరలు అదుపు తప్పి పెరిగి పోతున్నాయి. ఇప్పుడు అక్కడ ద్రవ్యోల్బణం 56 శాతానికి చేరుకుంది. నిరుద్యోగం 35 శాతం ఉంది. దేశంలో సగానికి పైగా ప్రజలు అధికారిక దారిద్ర్యరేఖకు దిగువకు చేరారు.

ఈ లక్షణాలన్నీ కరోనాకు ముందే పొడచూపాయి. కరోనా రావడంతో అవి తీవ్ర రూపం దాల్చాయి. ఈ లక్షణాలు దాదాపు అన్ని మూడో ప్రపంచ దేశాల్లోనూ ఉన్నాయి. దీనికి కారణం ఆ దేశాలన్నీ నయా ఉదారవాద విధానాలను అమలు చేయడమే. ఆ విధానాల పర్యవసానంగా ఈ దేశాలన ఆర్థిక వ్యవస్థలన్నీ ప్రపంచ ఆర్థిక వ్యవస్థతో గట్టిగా ముడి వేసుకుపోయి విడగొట్టుకోలేని పరిస్థితి ఏర్పడుతుంది.

తమకు 1000 నుండి 1500 కోట్ల డాలర్ల విదేశీ రుణం తక్షణమే అవసరమని లెబనీస్ ప్రభుత్వం కోరుతోంది. అయితే మార్చి నెల నాటికే అది విదేశీ

రుణ వాయిదాలను చెల్లించలేక ఎగవేతదారుగా పరిగణింపబడుతోంది. దానివలన కొత్తగా రుణం ఎవరూ ఇవ్వడం లేదు. లెబనాన్‌లో ఉన్న ప్రభుత్వం ప్రజల విశ్వసనీయతను కోల్పోయింది. ప్రస్తుత పరిస్థితికి కారణం ఆ దేశం అనుసరించిన ఉదారవాద విధానాలే అయినా దానిని కప్పిపుచ్చి ప్రభుత్వంలో, రాజకీయ నాయకులలో, అధికారులలో నెలకొన్న అవినీతి కారణంగానే ప్రస్తుత దుస్థితి ఏర్పడిందన్న ప్రచారం సాగుతోంది.

ఈ అవినీతి గురించిన ప్రచారం కొత్తదీ కాదు, అవాస్తవమూ కాదు. కాని దేశ ఆర్థిక వ్యవస్థ ఈ స్థితిలో ఉండడానికి మూల కారణం నయా ఉదారవాద విధానాలే అన్న వాస్తవాన్ని, ప్రపంచ పెట్టుబడిదారీ విధానం మొత్తంగానే ఈ కారణంగా సంక్షోభంలో పడిందన్న వాస్తవాన్ని ఈ ప్రచారం కప్పిపుచ్చుతోంది.

నిజానికి మూడో ప్రపంచ దేశాల్లో చాలా ప్రభుత్వాలు అవినీతికి పాల్పడేవే. అయితే ఈ అవినీతి వల్లే ప్రస్తుత సంక్షోభం ఏర్పడిందనడం పొరపాటు వాదన. ప్రస్తుత సంక్షోభం కేవలం మూడో ప్రపంచ దేశాలకే పరిమితం కాలేదు. అభివృద్ధి చెందిన, సంపన్న దేశాలలోనూ సంక్షోభం తీవ్రంగానే ఉంది. అంతే కాదు, మితిమీరిన అవినీతి అనేది నయా ఉదారవాద ఆర్థిక వ్యవస్థల్లో ఉండే ఒక లక్షణం. అంతకు ముందున్న వ్యవస్థల్లోనూ అవినీతి ఉండేది. మార్కెట్‌ను ప్రభుత్వం నియంత్రించే విధానాలు అమలు చేసేటప్పుడు సులువుగా అవినీతికి పాల్పడే అవకాశం ఉంటుంది. అయితే పెద్ద ఎత్తున ప్రైవేటీకరణకు పూనుకునేటప్పుడు, కార్పొరేట్లకు భారీగా రాయితీలను కల్పించేటప్పుడు అంతకన్నా ఎక్కువ స్థాయిలో అవినీతికి ఆస్కారం ఏర్పడుతుంది. అందుకే నయా ఉదారవాద దశలో అవినీతి రికార్డు స్థాయిలో పెరిగిపోతుంది.

ప్రజల్లో లెబనాన్ ప్రభుత్వంపై తీవ్ర ఆగ్రహం నెలకొని వున్న దశలో, అవినీతికర ప్రభుత్వమే తమ దుర్దశకు కారణం అని వారంతా భావిస్తున్న వాతావరణంలో బీరుట్‌లో అమోనియం నైట్రేట్ భారీ పేలుడు సంభవించింది. ఆ విషాద ఘటన వలన ప్రజలు పెద్ద సంఖ్యలో ప్రాణాలను కోల్పోయారు. భారీగా ఆస్తి నష్టం కూడా జరిగింది. దీంతో మరింత పెద్దఎత్తున ప్రజల్లో ఆగ్రహం పెల్లుబికింది. ఇదంతా రాజకీయ నాయకుల అవినీతి కారణంగానే జరిగిందని, వెంటనే ప్రభుత్వం దిగిపోవాలని ప్రజలు రోడ్ల పైకి వచ్చారు. ఆందోళనలు చేపట్టారు. ఆ నిరసన ప్రదర్శనల్లో పోలీసులతో ఘర్షణలు పడ్డారు. వాటిలో 500 మందికి పైగా ప్రజలు తీవ్రంగా గాయపడ్డారు.

సంక్షోభంలో చిక్కుకున్న దేశంలో ఈ విధంగా ప్రభుత్వాలు దిగిపోవాలంటూ ఆందోళనలు జరగడం ఆశ్చర్యాన్ని కలిగించే విషయం ఏమీ కాదు, ఇటువంటి

ఆందోళనలు గతంలోనూ చాలా చోట్ల జరిగాయి. ఈ సందర్భాన్ని సామ్రాజ్యవాద దేశాలు ఏ విధంగా తమకనుకూలంగా మలుచుకుంటున్నాయనేదే ఇప్పుడు కొత్తగా మనం గమనించాల్సిన అంశం. బీరుట్ పేలుడు జరిగిన వెంటనే అక్కడికి చేరుకున్న మొట్టమొదటి సంపన్న దేశ ప్రతినిధి ఫ్రాన్స్ అధ్యక్షుడు ఇమ్మాన్యుయెల్ మాక్రాన్. రెండో ప్రపంచ యుద్ధానికి ముందు కాలంలో లెబనాన్ ఫ్రాన్స్ దేశపు వలసగా ఉండేది. ఇప్పటికీ ఆనాటి సామ్రాజ్యవాద దురహంకారాన్నే మాక్రాన్ ప్రదర్శించాడు. రాజకీయ, ఆర్థిక సంస్కరణలు తాము చెప్పిన విధంగా చేపడితే లెబనాన్‌కు ఆర్థిక సహాయం చేస్తామని అతగాడు ప్రకటించాడు. ఆ వెంటనే అమెరికా రంగంలోకి దిగింది. ఆందోళనకారులకు మద్దతు ప్రకటించింది. లెబనీయులిప్పటికే చాలా ఇబ్బందులు పడ్డారని ఆవేదన వ్యక్తం చేసింది. ఆర్థికాభివృద్ధి కోసం, అవినీతి లేని, జవాబుదారీతనం కలిగి వుండే ప్రభుత్వం ఏర్పడాలని, విదేశీ వత్తిడి ఉండరాదని లెబనాన్ ప్రజలు చేస్తున్న పోరాటానికి అమెరికా అండగా ఉంటుందని ప్రకటించింది.

'రాజకీయ, ఆర్థిక సంస్కరణలు' కావాలని మాక్రాన్ అన్నా, 'అవినీతి లేని, జవాబుదారీతనం ఉన్న ప్రభుత్వం' ఏర్పడాలని అమెరికా అన్నా దాని సారాంశం ఒక్కటే. లెబనాన్‌లో సామ్రాజ్యవాదులకు అనుకూలంగా ఉండే ప్రభుత్వం ఏర్పడాలన్నదే అసలు విషయం. ఇప్పుడున్న ప్రభుత్వం ఇరాన్ బలపరుస్తున్న హిజ్‌బుల్లాకు అనుకూలంగా ఉంది. అది ఇజ్రాయిల్ ప్రయోజనాలకు వ్యతిరేకం. అందుచేత ఆ స్థానంలో ఇజ్రాయిల్‌కు అనుకూలంగా వ్యవహరించే ప్రభుత్వం ఏర్పడాలన్నదే అమెరికా, ఫ్రాన్స్ కోరుకుంటున్నాయి. అటువంటి ప్రభుత్వం నయా ఉదారవాద విధానాలను మరింత జోరుగా అమలు చేయాలని అవి వాంఛిస్తున్నాయి.

సామ్రాజ్యవాదులు కోరుకున్నట్టే లెబనాన్‌లో కొత్త ప్రభుత్వం ఏర్పడిందని మాట వరసకు అనుకుందాం. ఆ ప్రభుత్వానికి వారిచ్చే రుణం కొంత కాలం తర్వాతనైనా తీర్చాల్సిందే. అలా తీర్చడానికి సొమ్ము ఎక్కడి నుంచి వస్తుంది? కరోనా ప్రమాదం గడిచిపోయిన తర్వాత మళ్ళీ టూరిజం కొంత పుంజుకోవచ్చు. గల్ఫ్ నుండి కూడా మళ్ళీ చెల్లింపులు మొదలవవచ్చు. కాని లెబనాన్‌లో ఏర్పడ్డ సంక్షోభం కరోనా కంటే ముందు నుంచే ఉంది. కరోనా అక్కడ ప్రవేశించక ముందే, మార్చిలోనే లెబనాన్ విదేశీ రుణ వాయిదాల చెల్లింపు చేయలేని స్థితిలో పడింది. ప్రపంచ వ్యాప్తంగా ఏర్పడిన సంక్షోభం పర్యవసానంగానే, తక్కిన మూడో ప్రపంచ దేశాలలో మాదిరిగా, లెబనాన్‌లో కూడా పరిస్థితి దిగజారింది. ఈ ప్రపంచ ఆర్థిక సంక్షోభం నుండి గట్టెక్కే సూచనలేవీ సమీప దూరంలో కానరావడం లేదు. అటువంటప్పుడు రుణ వాయిదాలు చెల్లించాలంటే అందుకు పొదుపు చర్యలొక్కటే మార్గం. అంటే

ప్రజల సంక్షేమం కోసం చేసే ఖర్చు మరింత తగ్గించడమే. దానివలన ప్రజల చేతుల్లో ఉండే సొమ్ము మరింత తగ్గుతుంది.

రుణం లభిస్తే తక్షణం విదేశీ చెల్లింపుల సమస్య కొంతవరకూ తగ్గుతుంది. అందువలన ద్రవ్యోల్బణమూ కొంత తగ్గుతుంది. కాని పొదుపు చర్యల పేరుతో ప్రజల ఆదాయాలు పడిపోతాయి. దాని వలన నష్టపోయేది సామాన్య ప్రజలే. అదే సమయంలో ఈ కష్ట కాలంలో వెంటనే విదేశీ రుణం లభించడంతో ప్రజలు నయా ఉదారవాద విధానాలను మొత్తంగా ఎదిరించాలనే విధంగా స్పందించే వీలుండదు. లెబనాన్‌లో ఆర్థిక పురోగతి జరగకపోగా సంక్షోభం మాత్రం కొనసాగుతుంది.

ప్రస్తుత ఆర్థిక సంక్షోభం మూడో ప్రపంచ దేశాలన్నింటినీ ఆవరించింది. ఈ పరిస్థితిలో ఆ దేశాలపై తమ పట్టును మరింతగా బిగించడానికి సామ్రాజ్యవాదులు కొత్త వ్యూహాలతో సిద్ధం అవుతున్నారు. లెబనాన్ పరిణామాలు దీనినే సూచిస్తున్నాయి. ఈ వ్యూహంలో మొదటి అంశం-సంక్షోభ దుస్థితికి కారణం రాజకీయ నాయకుల, ప్రభుత్వాల అవినీతి అని చెప్పడం ద్వారా నయా ఉదారవాద పెట్టుబడిదారీ విధానాల వైఫల్యం వైపు నుండి ప్రజల దృష్టిని మళ్ళించడం. పలు మూడో ప్రపంచ దేశాల ప్రభుత్వాలు అవినీతిలో కూరుకుపోయి వున్నందున ఈ వాదనకు కొంత బలం చేకూరుతుంది. సంక్షోభంతో దెబ్బ తిన్న దేశాల ఆర్థిక వ్యవస్థలను సహాయం పేరుతో మరింత గట్టిగా నయా ఉదారవాద విధానాలను అమలు చేసేలా లొంగదీయడం రెండో అంశం. తక్షణ సహాయం పేరుతో రుణాలివ్వడం, ఆ రుణంతోబాటు మరిన్ని విషమ షరతులను విధించడం ఇందులో భాగం. ఏ నయా ఉదారవాద విధానాలు ఆ దేశాలను సంక్షోభం లోకి తెచ్చాయో, ఆ విధానాలనే మరింత లోతుగా అమలు చేసేట్టు చూడడం జరుగుతుంది.

ఈ విధానాలను అమలు చేసి ప్రజల్లో భ్రష్టు పట్టిపోయిన ప్రభుత్వం స్థానంలో తమకు అనుకూలంగా, మరింత లొంగి వుండే మరో నయా ఉదారవాద ప్రభుత్వాన్నే తెచ్చుకోవడం మూడో అంశం. ఆ విధంగా నయా ఉదారవాద చట్రం నుండి బైటకు పోకుండా, తమ ఆధిపత్యం కొనసాగేలా సామ్రాజ్యవాదం ప్రయత్నిస్తుంది. ఈ క్రమంలో మూడో ప్రపంచ దేశాలపై తమ పట్టును మరింత పెంచుకోవాలన్నదే సామ్రాజ్యవాదుల వ్యూహం. ఈ వ్యూహం ప్రజల జీవన పరిస్థితుల్లో ఎటువంటి మెరుగుదలకూ దారితీయదు. అందువలన ఎక్కువ కాలం ఈ వ్యూహం పని చేయదు. కాని పెట్టుబడిదారీ విధానానికి దీర్ఘకాలంలో ఏం జరుగుతుందన్నది ఎప్పుడూ పట్టదు. తక్షణం తన పెత్తనానికి ఎటువంటి సవాలూ రాకుండా చూసుకోవడం మీదనే దాని దృష్టి అంతా ఉంటుంది. ఇక ప్రజల బాగోగులు దానికి ఎప్పుడూ పట్టవు.

●

# మరో 'న్యూ డీల్ ' సాధ్యమేనా?

పెట్టుబడిదారీ వ్యవస్థ ప్రతినిధులలో కాస్త ముందుచూపున్న పెద్దలు ప్రస్తుత ఆర్థిక సంక్షోభం తలెత్తిన తొలి నాళ్ళలోనే దీనినుంచి బైటపడే మార్గాల గురించి సూచనలిస్తూ వచ్చారు. ఆర్థిక వ్యవస్థ పుంజుకొనేందుకు అవసరమైన 'ప్రేరణ'ను ఇచ్చే విధంగా ప్రభుత్వ వ్యయాన్ని బాగా పెంచాలని వారంతా సూచించారు. ఇప్పుడు ఆ సూచన కాస్తా బ్రిటన్ వరకైనా ఒక అధికారిక విధానంగా మారిందని చెప్పాలి. 1930 దశకంలో అమెరికాలో అప్పటి అధ్యక్షుడు ఫ్రాంక్లిన్ డి రూజ్‌వెల్ట్ 'న్యూ డీల్' పేరిట అమలు చేసిన విధంగానే తానూ ఇప్పుడు బ్రిటన్‌లో ప్రభుత్వ పెట్టుబడిని బాగా పెంచుతానని ప్రధాని బోరిస్ జాన్సన్ ఇటీవల ప్రకటించారు. ప్రత్యేకించి రూజ్‌వెల్ట్ అమలు చేసిన 'న్యూ డీల్' గురించి ప్రస్తావిస్తూ అప్పటి లాగానే ఇప్పుడు కూడా అవసరమైతే సంపన్నులపై పన్నులు పెంచుతానని జాన్సన్ అన్నారు.

నయా-ఉదారవాద విధానం ఇంక ఎంతమాత్రమూ కొనసాగే అవకాశాలు లేవని, దాని ముందున్న దారులన్నీ మూసుకుపోయాయని ఇప్పటికైనా జాన్సన్ గుర్తించడం అభినందనీయమే. మార్కెట్‌లో పెట్టుబడిదారులను ఏ విధంగానైనా నియంత్రించేలా ప్రభుత్వం జోక్యం కల్పించుకోరాదంటూ ఇంతకాలమూ నయా ఉదారవాదం వాదిస్తూ వచ్చింది. అయితే ఇప్పుడది పెద్ద సంక్షోభంలో కూరుకుపోయింది. దాన్నుంచి బైట పడాలంటే ప్రభుత్వ జోక్యం అనివార్యం అయింది. మన మోడీ ప్రభుత్వానికి మాత్రం ఇంకా ఈ విషయం అర్థం కాలేదు. ఇప్పటికీ అది 'సంపద సృష్టికర్తలకు' ప్రోత్సాహకాలివ్వడమే అన్ని సమస్యలకూ పరిష్కారమన్న పాత చింతకాయ పచ్చడి కబుర్లనే పదే పదే వల్లిస్తోంది. మన సంగతి పక్కనబెడితే జాన్సన్ గాని, మరే పశ్చిమ దేశపు అధినేత గాని తాను కోరుకున్నంత మాత్రాన 'న్యూ డీల్ ' ను తమ దేశంలో అమలు చేయడం అంత సాధ్యం అయ్యే పని కాదు.

1930 దశకంలో 'న్యూ డీల్' ను అమలు చేసేనాటి పరిస్థితులు వేరు, ఇప్పటి పరిస్థితులు వేరు. అప్పట్లో అంతర్జాతీయీకరణ చెందిన ద్రవ్య పెట్టుబడి లేదు. ఏ దేశానికాదేశంగానే ద్రవ్య పెట్టుబడి ఉండేది. ఆయా దేశాల ప్రభుత్వాల తోడ్పాటుతో అది మనగలిగేది. ఈ దేశాలన్నీ ఒక తీవ్రమైన పరస్పర పోటీలో ఉండేవి. సామ్రాజ్యవాద దేశాల మధ్య అంతర్ వైరుధ్యాలు తీవ్రంగా ఉండే కాలం అది. అప్పుడు ఒక దేశంలోని ప్రభుత్వానికి ఆ దేశపు ద్రవ్య పెట్టుబడిని ఏదో ఒక మేరకైనా అదుపు చేయగలిగే వీలుండేది. తమ దేశంలో వ్యవస్థను కాపాడుకోడానికి అవసరమైన విధాన మార్పును (న్యూ డీల్ వంటిది) రూపొందించి దానిని ఆ దేశపు ద్రవ్య పెట్టుబడి అంగీకరించేలా ఒప్పించగలిగే పరిస్థితి ఆ దేశాల ప్రభుత్వాలకు వుండేది.

అటువంటి పరిస్థితిలో కూడా అమెరికన్ ద్రవ్య పెట్టుబడి ఆనాడు రూజ్‌వెల్ట్ తెచ్చిన 'న్యూ డీల్' ను తీవ్రంగా వ్యతిరేకించింది. ఆ 'న్యూ డీల్' అమలు ఫలితంగా మాంద్యం నుండి అమెరికన్ ఆర్థిక వ్యవస్థ కోలుకుంటున్నప్పటికీ దాని అమలును పాక్షికంగా అడ్డుకుంది. దాంతో అమెరికన్ ప్రభుత్వం వెనకడుగు వేయకతప్పలేదు. దాని ఫలితంగా 1937 లో అమెరికన్ ఆర్థిక వ్యవస్థ తిరిగి మరోసారి మాంద్యంలో కూరుకుపోయింది. ఆ తర్వాత రెండో ప్రపంచ యుద్ధానికి సిద్ధం అవుతూ ఆ క్రమంలో ఆయుధాల ఖర్చు పెంచడం ద్వారా ప్రభుత్వ వ్యయం పెరిగి దాని పర్యవసానంగా మాంద్యం నుండి ఆ దేశం బైట పడగలిగింది. అంత వరకూ వస్తు వినిమయ రంగంలో కొంత మెరుగుదల వచ్చినా, పారిశ్రామిక రంగంలో యంత్ర సాధనాలపైన గాని, ముడి సరుకులపై గాని ఖర్చు ఏమాత్రం పెరగలేదు. ఆయుధాల డిమాండు ఒక్కసారి పెరిగేసరికి పారిశ్రామిక పెట్టుబడి వ్యయం పెరిగి ఆర్థిక వ్యవస్థ పుంజుకుంది.

మార్కెట్‌లో ప్రభుత్వం జోక్యం చేసుకుంటే అది కార్పొరేట్ల ద్వారా మాత్రమే జరగాలన్నది ద్రవ్య పెట్టుబడి వైఖరి. అందుకు భిన్నంగా నేరుగా ప్రభుత్వం గనుక జోక్యం కల్పించుకుంటే దానిని ద్రవ్య పెట్టుబడి తీవ్రంగా వ్యతిరేకిస్తుంది. ఈ వ్యతిరేకత అప్పుడూ ఉంది, ఇప్పుడూ ఉంది. కార్మిక హక్కులను కాలరాయడం, తమకు మరింతగా పన్ను రాయితీలివ్వడం వంటి చర్యలను ప్రభుత్వం అమలు చేసి తమచేత మరింత ఎక్కువగా పెట్టుబడులను పెట్టించేలా ప్రేరేపించాలే తప్ప ప్రభుత్వమే నేరుగా జోక్యం కల్పించుకోగూడదు. ద్రవ్య పెట్టుబడి కోరుకునేది ఇదే (ఇటువంటి చర్యలు అన్నీ మోడీ ప్రభుత్వం చేపట్టింది. అయినా కార్పొరేట్లు పెట్టుబడులు పెట్టడానికి ముందుకు రావడం లేదు. అది వేరే సంగతి).

ఆర్థిక సంక్షోభం ఎంత తీవ్రంగా ఉన్నా, ప్రభుత్వ జోక్యం అనివార్యమైనా అటువంటి జోక్యాన్ని ద్రవ్య పెట్టుబడి ఒప్పుకోదు. ప్రభుత్వ జోక్యం వల్ల ఆర్థిక వ్యవస్థ

పుంజుకుంటే ఇక పెట్టుబడిదారుల ఆధిపత్యం అవసరం ఏముందన్న ప్రశ్న ఎదురౌతుంది. పెట్టుబడిదారులను కాపాడి, వారిని ప్రోత్సహించవలసిన అగత్యం సమాజానికి ఏముందన్న ప్రశ్న ముందుకొస్తుంది. ఆ వర్గం చేసే పనిని అంతకన్నా మెరుగ్గా ప్రభుత్వం, ప్రభుత్వ రంగం చేయగలిగినట్టు స్పష్టమైతే ఇక పెట్టుబడిదారుల అవసరం ఉండదని అందరికీ అర్థమైపోతుంది. అందువల్లే, ద్రవ్య పెట్టుబడి ప్రభుత్వ జోక్యాన్ని ఒప్పుకోదు.

రెండో ప్రపంచ యుద్ధం తర్వాత కాలంలో అనేక దేశాల్లో ప్రభుత్వాలే నేరుగా అర్థిక వ్యవస్థలో జోక్యం కల్పించుకుని ప్రభుత్వ రంగాన్ని నిర్మించాయి. దేశాభివృద్ధి జరగాలంటే పెట్టుబడిదారుల అవసరం ఏమీ లేదన్న భావన బలపడింది. అందుకే నయా ఉదారవాద సంస్కరణల అమలును చేపట్టే సమయంలో ప్రభుత్వ రంగాన్ని అపఖ్యాతిపాలు చేసే ప్రచారం ముమ్మరంగా సాగింది. ఇప్పుడు, ఇన్నాళ్ళ తర్వాత మళ్ళీ జాన్సన్ ప్రభుత్వ పెట్టుబడిని పెంచడం గురించి మాట్లాడుతున్నాడంటే అది చాలా ప్రాధాన్యతను సంతరించుకుంది. ఎటువంటి నిస్సహాయ స్థితిలో పెట్టుబడిదారీ వ్యవస్థ ఉందో మనకి తెలుస్తోంది. నయా ఉదారవాద విధానాలు తెచ్చిపెట్టిన సంక్షోభం దానిని మరణశయ్య మీదకు చేర్చిందని స్పష్టం అవుతోంది.

'న్యూ డీల్' ను 1930 దశకంలో వ్యతిరేకించినట్టే, అదే కారణాల వలన, ఇప్పుడూ అటువంటి ప్రతిపాదనలను ద్రవ్య పెట్టుబడి వ్యతిరేకిస్తుంది. ఈ వ్యతిరేకత అప్పటికన్నా చాలా తీవ్రంగా ఉంటుంది. 1930 ల్లో ఏ దేశానికి ఆ దేశం తన స్వంత ద్రవ్య పెట్టుబడిని ఒప్పించగలిగితే సరిపోయేది. కాని ఇప్పుడు ప్రతీ దేశమూ అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడిని ఎదుర్కోవాలి. ద్రవ్య పెట్టుబడి అంతర్జాతీయాకరణ చెందడమంటే ఏమిటి? ఏ ప్రభుత్వమైనా ఈ ద్రవ్య పెట్టుబడి ఆదేశాలకు భిన్నంగా గనుక వ్యవహరిస్తే, 'న్యూ డీల్' వంటి చర్యలతో సంపన్నులపై పన్నులను పెంచితే, ద్రవ్యలోటును పరిమితికి మించి పెంచితే, వెంటనే ఆ దేశం నుంచి పెట్టుబడి ఇతర దేశాలకు ఎగిరిపోతుంది. దాంతో ఆ దేశంలో అర్థిక సంక్షోభం తీవ్రమౌతుంది. గతంలో ద్రవ్య పెట్టుబడి తన ప్రభుత్వంపై రాజకీయంగా వత్తిడి తెచ్చేది. ఇప్పుడు ఆ రాజకీయ వత్తిడికి తోడు అర్థిక దాడికి కూడా పూనుకుంటుంది. ఆ దేశం నుండి పెట్టుబడి ఎగిరిపోతుంది.

ఇప్పుడు ప్రపంచం మొత్తం గనుక ఒకే ప్రభుత్వంగా ఉన్నట్లయితే ఈ అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడికి ముకుతాడు వేయవచ్చు. కనీసం అన్ని ప్రభుత్వాలూ కలిసి కూడబలుక్కుని వ్యవహరించినట్లయితే, ఒకేసారి అన్ని దేశాల్లోనూ 'న్యూ డీల్' అమలు చేపట్టినట్టయితే ఇక ఎక్కడికి ఎగిరిపోవాలో తెలియక ద్రవ్య పెట్టుబడి

దిగిరావచ్చు. కాని ఇటువంటి ఆలోచనలను ఏ పెట్టుబడిదారీ సిద్ధాంతవేత్తగాని, ఏ సంపన్న దేశంగాని చర్చించడానికి ప్రయత్నమే చేయడంలేదు.

ఇటువంటి సమయంలో బోరిస్ జాన్సన్ సంపన్న దేశం అయిన బ్రిటన్‌లో విడిగా 'న్యూ డీల్' ను అమలు చేయడానికి పూనుకుంటే తన దేశం నుండి పెట్టుబడి ఎగిరిపోకుండా అవసరమైన చర్యలను తీసుకోవలసి వుంటుంది. అందుకు అవసరమైన ఆంక్షలను పెట్టుబడిపై విధించవలసి వుంటుంది. బ్రిటన్ ఆర్థికంగా బలమైన దేశమే. దాని ఆర్థిక ప్రయోజనాలన్నీ లండన్ నగరం చుట్టూ నెలకొని వున్నాయి. ఆ నగరాన్ని వదిలిపెట్టి ద్రవ్య పెట్టుబడి ఎగిరిపోకుండా నిరోధించే శక్తి బ్రిటన్‌కు లేదు. ఈ సంగతి విస్మరించి న్యూడీల్ గురించి మాట్లాడడం అంటే అది కేవలం కాలక్షేపం కోసం కబుర్లు చెప్పడం వంటిదే. సంక్షోభం ఎందుకొచ్చిందో, దానిని నివారించడానికి ఏం చేయాలో ఒక ఆర్థిక సిద్ధాంతంగా జాన్ మేనార్డ్ కీన్స్ ఆనాడు చెప్పాడు. కాని అది అమలు కాలేదు. ద్రవ్య పెట్టుబడి ప్రతిఘటనే దానికి కారణం. ఇప్పుడూ అంతే. అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడి ప్రతిఘటనను పరిగణనలోకి తీసుకోకుండా, దానిని తిప్పికొట్టే చర్యలకు పూనుకోకుండా 'న్యూ డీల్' గురించి మాట్లాడడం అంటే అది వట్టి కబుర్లు చెప్పడమే.

ఇప్పుడు అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడి ప్రతిఘటనను ఓడించి మరో 'న్యూ డీల్' వంటిది అమలు చేయాలంటే అది వర్గ పోరాటం ద్వారా మాత్రమే సాధ్యం. కార్మికవర్గాన్ని సమీకరించి ద్రవ్య పెట్టుబడి పెత్తనానికి వ్యతిరేకంగా పోరాడాల్సి వుంటుంది. కాని అది బోరిస్ జాన్సన్ సారథ్యం వహిస్తున్న ఒక మితవాద ప్రభుత్వానికి సాధ్యమా? నిజానికి ఆ దేశంలో ప్రతిపక్షంగా ఉన్న లేబర్ పార్టీకి, దాని 'మధ్యేవాద' నాయకత్వానికి సైతం ఇటువంటి పోరాటం చేయడం, అందులో కార్మిక వర్గాన్ని సమీకరించడం సాధ్యమయ్యే పని కాదు. అటువంటి పోరాటాలు వామపక్ష ఉద్యమాలద్వారా మాత్రమే సాధ్యపడతాయి. వామపక్ష శక్తులు గనుక అటువంటి ఉద్యమాలను నిర్వహిస్తే అప్పుడు సాగే వర్గ పోరాటాలు ప్రస్తుత పెట్టుబడిదారీ వ్యవస్థ చట్రం పరిధికే ఎందుకు పరిమితం కావాలి? ఇప్పుడున్న తరుణంలో దేశాన్ని ముందుకు నడిపించడానికి జరిపే పోరాటాలు ఈ పెట్టుబడిదారీ వ్యవస్థ లోనే పరిమితం కాకుండా ఆ పరిధిని దాటి సోషలిజం దిశగా సాగే అవకాశం ఉంది.

ఇరవయ్యో శతాబ్దం తొలినాళ్ళలో గుత్త పెట్టుబడిదారీ విధానం గురించి, దాని కొల్లగొట్టే దోపిడీ గురించి చర్చ నడిచింది. గుత్త పెట్టుబడిదారీ విధానం వలన సంక్షోభం వస్తోంది గనుక తిరిగి వెనక్కి, అంటే అంతకు ముందున్న స్వేచ్ఛా మార్కెట్ పోటీ ఉండే పెట్టుబడిదారీ విధానానికి మరలాలని పలువురు వాదించారు. దీనిని ఆనాడు లెనిన్ తీవ్రంగా వ్యతిరేకించారు. స్వేచ్ఛా మార్కెట్ విధానం నుండే గుత్త

పెట్టుబడిదారీ విధానం తలెత్తిందని వివరించారు. అందుచేత చెట్టు తిరిగి మొక్కగా మారడం సాధ్యం కానట్టే గుత్త పెట్టుబడిదారీ విధానం నుండి తిరిగి వెనక్కి స్వేచ్ఛా మార్కెట్ విధానానికి మళ్ళడం సాధ్యం కాదని లెనిన్ స్పష్టం చేశారు. గుత్త పెట్టుబడిదారీ దశ తర్వాత ఇక సోషలిజానికి మార్పు చెందడమే పరిష్కారం అని తెలిపారు.

ప్రస్తుతం కూడా ఇటువంటి చర్చే సాగుతోంది. నయా ఉదారవాదం ముందున్న దారులన్నీ మూసుకుపోయాయి. కనుక వెనక్కి మళ్ళి రెండో ప్రపంచ యుద్ధానంతర కాలంలో అమలు చేసిన ప్రభుత్వ పెట్టుబడిదారీ విధానాన్ని అమలు చేయాలని పెట్టుబడిదారీ వ్యవస్థ సమర్ధకులు, బోరిస్ జాన్సన్ వంటి నాయకులు వాదిస్తున్నారు. ఆ విధానం యొక్క ఒకానొక రూపమే 'న్యూ డీల్'. అయితే, ఈ తరహా ప్రభుత్వ పెట్టుబడిదారీ విధానం నుంచి పుట్టుకొచ్చిందే నయా ఉదారవాద విధానం. ప్రభుత్వం జోక్యంతో అమలు జరిగిన పెట్టుబడిదారీ విధానంలోని వైరుధ్యాల నుండి నయా ఉదారవాద విధానం పుట్టింది. ఇప్పుడు దీనిలోని వైరుధ్యాలను పరిష్కరించడానికి తిరిగి వెనక్కి పోవాలనే ప్రతిపాదన సరైన పరిష్కారం కాబోదు. కాలాన్ని వెనక్కు నడిపించడమనేది చరిత్రలో సాధ్యపడేది కాదు. ఇక్కడి నుంచి ముందుకు సాగడమే పరిష్కారం. ఆ ముందుకు సాగే ప్రక్రియ నుండే ఈ పెట్టుబడిదారీ వ్యవస్థ పరిధులను కూడా అధిగమించి ముందుకు పోయే అవకాశాలూ వస్తాయి.



# విదేశీ రుణాల సమస్య

**వి**పరీతంగా పెరిగిపోతున్న విదేశీ రుణాలు మూడో ప్రపంచ దేశాలకు తలకుమించిన భారంగా పరిణమిస్తున్నాయి. వ్యవసాయోత్పత్తుల ధరలు, ఇతర ముడి పదార్థాల ధరలు పతనం అవడమే ఈ సమస్యకు మూలం. ఇది 2011 ఏప్రిల్ నుండే మొదలైంది. ఈ ఏడాది మార్చి, ఏప్రిల్ నెలల్లో వీటి ధరలు మరీ అట్టడుగుకు దిగజారాయి. ఈ రెండు నెలల ధోరణినీ కరోనా ప్రభావం దృష్ట్యా పక్కనపెడదాం. ఏప్రిల్ 2011 నుంచి డిసెంబరు 2019 మధ్య వీటి ధరలు 38 శాతం పడిపోయాయి.

మూడో ప్రపంచ దేశాల్లో ఎక్కువ దేశాలు–ముఖ్యంగా ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాలు–తమ వ్యవసాయ, ఇతర ముడిసరుకుల ఎగుమతుల పైనే ప్రధానంగా ఆధారపడతాయి. వాటి ధరలు కాస్తా పడిపోవడంతో ఆ దేశాలు మరింతగా విదేశీ రుణాలను తీసుకోవలసి వచ్చింది. తద్వారా అవి తమ దిగుమతులకు చెల్లింపులు చేయగలిగాయి. విదేశీ రుణం ఎప్పుడైతే పెరిగిందో దానితోబాటే తిరిగి చెల్లించవలసిన రుణ వాయిదాల మొత్తం, ఆ రుణం మీద కట్టవలసిన వడ్డీ మొత్తం పెరిగిపోతూ వచ్చింది. ఇప్పుడు ఈ కరోనా మహమ్మారి వ్యాపించిన కారణంగా ఆ వాయిదాలను చెల్లించడం అసంభవం అయిపోయింది.

ఈ కరోనా లాక్‌డౌన్ కారణంగానే మూడో ప్రపంచ దేశాల వ్యవసాయోత్పత్తుల ధరలు పడిపోవడంతోబాటు, వాటి ఎగుమతులు కూడా తగ్గిపోయాయి. దీంతో ఆ దేశాల రాబడి మరింత దిగజారింది. సంపన్న దేశాలలో పని చేస్తూ తమ స్వదేశాలకు (మూడో ప్రపంచ దేశాలకు) ప్రవాసులు పంపే సొమ్ము కూడా తగ్గిపోయింది. కాని ఈ దేశాలు ఆ సంపన్న దేశాలకు చేసే చెల్లింపులు మాత్రం తగ్గలేదు. దాంతో చాలా మూడో ప్రపంచ దేశాల విదేశీ మారక నిల్వలు బాగా తగ్గిపోయాయి. ఆ దేశాల నుండి సంపద తరలిపోవడంతో వాటి కరెన్సీల విలువలు పడిపోయాయి. ఈ విధంగా పడిపోవడం వలన ఆ దేశాలు చెల్లించవలసిన

విదేశీ రుణాల వాయిదాల విలువ కూడా పెరిగిపోయింది (ఉదా. మన రూపాయి విలువ పడిపోతే మనం చెల్లించాల్సిన విదేశీ రుణ వాయిదా మొత్తం, అది డాలర్ల రూపంలో చెల్లించాలి గనుక పెరిగిపోతుంది).

ఈ సమస్య విదేశీ రుణాలతో ఆగిపోదు. అది ఆయా దేశాల ఆర్థిక వ్యవహారాల నిర్వహణ పైన కూడా పడుతుంది. విదేశాలకు చేసే ఎగుమతుల ద్వారా వచ్చే ఆదాయంపై ప్రభుత్వాలు పన్నులు వసూలు చేస్తాయి. ఎప్పుడైతే ఎగుమతులు పడిపోయాయో, ఎగుమతి చేసే వస్తువుల ధరలు సైతం పడిపోయాయో, వాటిపై వచ్చే ఆదాయమూ పడిపోతుంది, ఆ ఆదాయంపై వసూలు చేసే పన్నులు కూడా తగ్గిపోతాయి. కరోనా మహమ్మారి సమయంలో అవి మరీ ఎక్కువగా తగ్గిపోయాయి. సరిగ్గా ఈ సమయంలోనే ఈ దేశాలు ప్రజారోగ్యం పైన, ప్రజలను ఆదుకోవడం కోసం మరింత ఖర్చు చేయవలసి వుంది. రెండోవైపున కట్టవలసిన విదేశీ రుణ వాయిదాలు కట్టాల్సే వుంది.

ఈ పరిస్థితిలో ద్రవ్యలోటును పెంచి, కొనుగోలుశక్తిని, దానికనుగుణంగా వస్తూత్పత్తిని పెంచగలిగితే ప్రభుత్వాలు ఒకమేరకు ఈ పరిస్థితిలో నిలదొక్కుకోవచ్చు. కాని అలా ద్రవ్యలోటును పెంచడానికి అందర్జాతీయ ద్రవ్య పెట్టుబడి అంగీకరించదు. ఆ అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడి గుప్పెట్లో దాదాపు ఈ మూడో ప్రపంచ దేశాలన్నీ చిక్కుకుపోయి వున్నాయి. దాని మాట కాదని ఏదేశమైనా ద్రవ్యలోటును గనక పెంచితే, వెంటనే ఆ దేశం నుండి విదేశీ పెట్టుబడులు బైటకు తరలిపోతాయి. వెరసి, ఈ మూడో ప్రపంచ దేశాలన్నీ ప్రస్తుత అత్యవసర పరిస్థితిలో సైతం అతి ముఖ్యమైన ప్రజారోగ్యంపై చేయవలసిన ఖర్చును చేయలేని స్థితిలో ఉన్నాయి.

అందుకే ఈ దేశాలన్నీ జి-20 దేశాలను (సంపన్న దేశాలు) సహాయం చేయమని కోరుతున్నాయి. మొత్తానికి జి-20 దేశాలు ఒక “సహాయ కార్యక్రమాన్ని” ప్రకటించాయి. ప్రపంచంలోని అతిపేద దేశాలుగా ఉన్న 77 దేశాలు తాము వివిధ దేశాల నుండి తీసుకున్న ద్వైపాక్షిక రుణాల వాయిదాలను వెంటనే చెల్లించనవసరం లేదు. మే 1 నుండి డిసెంబరు 31 వరకూ చెల్లించవలసిన రుణ వాయిదాలను ఆ తర్వాత చెల్లించవచ్చు. కాని ఐఎంఎఫ్, ప్రపంచ బ్యాంకులకు చెల్లించాల్సిన వాయిదాలను మాత్రం యథావిధిగా ఏ నెలకానెల చెల్లించాలి. ప్రభుత్వాల నుండి కాకుండా, ప్రైవేటు వ్యక్తుల నుండి తీసుకున్న రుణాలను కూడా ఏ నెలకానెల చెల్లించాలి. ఇతర ప్రభుత్వాల నుండి తీసుకున్న రుణాల వాయిదాలను 2022 నుంచి 2024 మధ్య మూడేళ్ళలో వాయిదాలలో చెల్లించవచ్చు.

ఈ సహాయ కార్యక్రమం గురించి 2020 ఏప్రిల్ 16 న ప్రకటించారు. దానిని అందరూ స్వాగతించారు. కాని నిజానికి ఈ కార్యక్రమాన్ని పరిశీలిస్తే అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడి గాని, దానికొమ్ముగాసే సంపన్న దేశాలు గాని పేద దేశాలకు ఎటువంటి రాయితీనీ ఇవ్వకుండా తమ పట్టును ఎలా బిగిస్తాయో మనకు అర్థం అవుతుంది. మొదటిది- ఈ సహాయం (అంటే చెల్లించాల్సిన వాయిదాలను తాత్కాలికంగా వాయిదా వేయడం) ప్రభుత్వం నుంచి ఇంకొక ప్రభుత్వం తీసుకున్న రుణాలకే వర్తిస్తుంది. దానిలో కూడా వడ్డీ రేటును తగ్గించడం వంటి రాయితీ ఏమీ లేదు. అంటే రెండు, మూడేళ్ళ తర్వాత ఇప్పటి వాయిదాలన, అప్పటి వాయిదాలను కలిపి ఒకేసారి చెల్లించాల్సి వుంటుంది. ఇలా చెల్లించగలగాలంటే అప్పటికి ఈ మూడో ప్రపంచ దేశాల ఆదాయాలు పెరిగి వుండాలి. కాని ఈ దేశాల వ్యవసాయోత్పత్తుల, ఇతర ముడి సరుకుల ధరలు పడిపోయే క్రమం కొనసాగితే ఈ దేశాలకు వాయిదాలను చెల్లించగల స్థోమత ఇంకా తగ్గిపోతుందే కాని పెరగదు. అంటే జి-20 దేశాలు అంగీకరించిన రుణ చెల్లింపుల వాయిదా నిజానికి రెండుమూడేళ్ళ అనంతరం మూడో ప్రపంచ దేశాల పాలిట భరించలేని భారంగా మారనుంది. నిజంగా ఈ మూడో ప్రపంచ దేశాలను ఆదుకోవాలని జి-20 భావించి వుంటే ఈ 77 పేద దేశాల రుణాలను పూర్తిగా మాఫీ చేసి వుండాల్సింది. అదేమీ ఈ జి-20 దేశాలకు భారం కాదు.

ఇప్పుడు ప్రకటించిన "సహాయ కార్యక్రమం" వర్తించే పేద దేశాలన్నింటి విదేశీ రుణం అంతా కలిపితే 75,000 కోట్ల డాలర్లు. అదే ఈ జి-20 దేశాల మొత్తం వార్షిక జిడిపి చూస్తే 78,28,600 కోట్ల డాలర్లు. అంటే ఈ బడుగు దేశాల రుణం అంతా ఒక్క ఏడాదిలో జి-20 దేశాలలో జరిగే సంనద ఉత్పత్తిలో ఒక శాతం కన్నా తక్కువే. ఈ మాత్రం రుణాన్ని మాఫీ చేయడం జి-20 కి కష్టమేమీ కాదు. పిజానికి పేదరిక నిర్మూలన పై ఏర్పాటు చేసిన బ్రాండ్ట్ కమిషన్ ప్రతీ ఏడూ సంపన్న దేశాలు తమ జిడిపిలో ఒక శాతం చొప్పున పేద దేశాలకు విరాళంగా ఇవ్వాలని ప్రతిపాదించింది. ఆ సిఫార్సు బాగుందని అప్పట్లో అందరూ మెచ్చుకున్నారు కూడా. అంటే పేద దేశాల రుణాన్ని మాఫీ చేయడం సంపన్న దేశాలకు కష్టమేమీ కాదు. బ్రాండ్ట్ కమిషన్ చెప్పినట్టు ప్రతీ ఏడూ కాకపోయినా ఈ కష్టకాలంలోనైనా ఈ ఒక్కసారికీ ఆ విధంగా మాఫీ ప్రకటించి వుండొచ్చు. కాని ఆపాటి కూడా చేయడానికి జి-20 ముందుకి రాలేదు. అదీ ఈ సంపన్న దేశాల మానవత్వం.

ఆ 77 పేద దేశాలకే గాదు, గ్రీస్, స్పెయిన్, ఇటలీ వంటి యూరప్ దేశాలకు సైతం ఇప్పుడు రుణ భారం పెద్ద సమస్యగా దాపురించింది. జర్మన్ బ్యాంకులు

గ్రీస్ దేశ ఆర్థిక వ్యవస్థను కొద్ది సంవత్సరాల క్రితం ఏవిధంగా దివాలా ఎత్తించాయో అదే విధంగా కొన్ని ఇతర యూరప్ దేశాల విషయంలో కూడా రాబోయే రోజుల్లో జరుగుతుంది. ఇలా పలు దేశాల ఆర్థిక వ్యవస్థలు కుప్పకూలక ముందే సంపన్న దేశాలు రుణ మాఫీని ప్రకటించడం శ్రేయస్కరం. అలా చేయకుండా ఇప్పటి మాదిరిగానే రానున్న రోజుల్లో కూడా అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడి, సంపన్న దేశాలు మితిమీరిన స్వార్ధంతో వ్యవహరిస్తే దెబ్బతిన్న దేశాల నుండి బలమైన ప్రతిఘటన ఎదురౌతుంది. అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడి ఇప్పుడు స్వచ్ఛందంగా స్పందించకపోతే అప్పుడు తప్పనిసరిగా ప్రజా ప్రతిఘటనను ఎదుర్కోవలసి వస్తుంది.

ఈ మహమ్మారి ప్రమాదాన్ని అధిగమించిన తర్వాత మళ్ళీ మామూలుగా, అంతకు ముందున్న పరిస్థితులే తిరిగి నెలకొంటాయని, తమ ఆధిపత్యాన్ని గతంలో మాదిరిగానే మూడో ప్రపంచ దేశాలు అంగీకరిస్తాయని అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడి అనుకుంటే అంతకంటె మూర్ఖత్వం ఇంకొకటి ఉండదు.



# మోసపూరిత గణాంకాలు

ఈ మధ్య ప్రపంచ బ్యాంకు అధికార గణం, ఇంకా చాలామంది ఆర్థిక వేత్తలు, వివిధ దేశాల ప్రభుత్వాలు తమను తామే అభినందించుకుంటున్నారు. 1990 దశకం నుండి ఇటీవల కోవిడ్-19 మహమ్మారి వచ్చిపడే ముందు వరకూ గడిచిన కాలంలో పేదరికం బాగా తగ్గిపోయిందట. ఎవరు పేదలో నిర్ధారించడానికి ప్రపంచ బ్యాంకు ఒక అంతర్జాతీయ దారిద్ర్య రేఖను నిర్ణయించింది. 2011 నాటికి 1.90 అమెరికన్ డాలర్లతో అమెరికాలో ఎన్ని సరుకులు కొనవచ్చునో తేల్చి, అంత మేరకు ఒక వ్యక్తి కొనగలిగితే అతడు లేక ఆమె పేదరికంలో లేనట్టేనని నిర్ధారించింది. అవే వస్తువులను ఏ ఇతర దేశంలోనైనా అక్కడ కరెన్సీతో కొనడానికి ఎంత సొమ్ము అవసరమో లెక్కించి ఆమేరకు ఒక వ్యక్తికి రోజుకు ఆదాయం వచ్చినట్లైతే ఆ వ్యక్తి పేదరికంలో లేనట్టే అని తేల్చి చెప్పారు. (కరెన్సీ మారకపు విలువను బట్టి గాక ఆ కరెన్సీతో కొనుగోలు చేయగలిగే సరుకులు బట్టి లెక్క వేయడం - దీనినే పర్చేజింగ్ పవర్ పారిటీ లేదా పిపిపి అంటారు.) రోజుకు ఒక వ్యక్తి గనుక 1.90 అమెరికన్ డాలర్లు సంపాదించగలిగితే (2011 నాటి లెక్క) ఆ వ్యక్తి పేదరికంలో లేనట్టే. 1.90 అమెరికన్ డాలర్లతో 2011లో ఎన్ని సరుకులు పొందవచ్చో అన్ని సరుకులను ఒక రోజులో పొందలేనట్లైతే అటువంటివారు పేదరికంలో ఉన్నట్టు లెక్క. ఈ దారిద్ర్య రేఖ ఎంత అన్యాయంగా నిర్ణయించారో చూడండి. 2011లో 1.90 డాలర్లతో అమెరికాలో ఒక కప్పు కాఫీ మాత్రమే వస్తుంది. అప్పటి రేట్ల ప్రకారం పిపిపి లెక్కిస్తే 1.90 డాలర్లతో కొనగలిగే సరుకులను ఇండియాలో 29 రూపాయలకు కొనవచ్చు. 2011లో రు.29 తో రెండు మంచినీటి బాటిళ్ళు మాత్రమే వస్తాయి. అంత తక్కువ ఆదాయంతో ఒక వ్యక్తి ఎలా జీవించగలడు? అది అసంభవం. కాని ప్రపంచ బ్యాంకు లెక్క ప్రకారం సంభవమే. ఈ దారిద్ర్యరేఖ ప్రకారం లెక్కించి 1990 నాటికి ప్రపంచ జనాభాలో 36 శాతం, అంటే 189 కోట్ల 50 లక్షలమంది ప్రజలు దరిద్రంలో ఉన్నారని, 2015 నాటికి వారి సంఖ్య 73 కోట్ల 60 లక్షలకు, అంటే జనాభాలో

కేవలం 10 శాతానికి తగ్గిపోయిందని, 115 కోట్లమందికి పైగా ప్రజలను పేదరికంలోనుంచి బైటకు తీసుకురాగలిగామని ప్రపంచ బ్యాంకు చెప్పుకుంటోంది.

తక్కిన వివరాలలోకి పోయేముందు ఈ పేదరికం ఎక్కడ, ఎంత తగ్గిందో కాస్త చూద్దాం. ప్రపంచ బ్యాంకు కొలబద్ద ప్రకారమే చూసినా, ఈ తరుగుదల ప్రధానంగా చైనాలో కనపడుతుంది. 1990లో చైనాలో 75 కోట్లమంది పేదరికంలో ఉంటే 2015 నాటికి ఆ సంఖ్య ఒక కోటికి తగ్గిపోయింది. అంటే మొత్తం ప్రపంచంలో పేదరికం నుంచి బైటపడిన వారిలో 64 శాతం ఒక్క చైనాలోనే ఉన్నారన్నమాట. ఇదే కాలంలో మధ్యప్రాచ్యంలో, ఆఫ్రికాలో అదనంగా పేదరికంలోకి జారిపోయినవారు 14 కోట్లమంది. ప్రపంచ బ్యాంకు లెక్కల ప్రకారమే చూసినా పేదరికం నుండి బైటపడడం అనేది చెప్పుకోదగ్గ స్థాయిలో జరిగింది ఒక్క చైనాలోనే. అందుచేత ఈ ఘనతను ప్రపంచబ్యాంకు తనకు, తను అమలు చేయిస్తున్న విధానాలకు ఆపాదించి గొప్పలు పోవడంలో అర్థం ఏమీ లేదు.

ఈ అంతర్జాతీయ దారిద్ర్య రేఖను కాస్త పైకి, అంటే, రోజుకు 2.5 డాలర్ల వద్దకు జరిపి చూస్తే 1990 నుండి 2010 మధ్య దారిద్ర్యం ఏమీ తగ్గలేదని కనపడుతుంది. దీనికి మళ్ళీ చైనా మాత్రం మినహాయింపు. అదే ఇంకాస్త పైకి, అంటే రోజుకు 5.5 డాలర్ల వద్దకు జరిపి లెక్క కడితే 1990 నుండి 2015 మధ్య దరిద్రంలో ఉన్న వారి సంఖ్య 200 కోట్ల నుండి 260 కోట్లకు పెరిగింది. ఇక్కడ కూడా చైనాను, తూర్పు ఆసియా దేశాలను మినహాయించి చూడాలి. అంటే, దారిద్ర్యం నుండి బైటపడడం అనే ధోరణి చైనాకు, కొన్ని తూర్పు ఆసియా దేశాలకు మాత్రమే ఈ కాలంలో పరిమితం అయిందన్నమాట.

ప్రపంచబ్యాంకు నిర్ణయించిన ఈ అంతర్జాతీయ దారిద్ర్యరేఖ మరీ హీనంగా ఉంది. అంత తక్కువ రోజువారీ ఆదాయంతో బతకడం ఎవరికైనా సాధ్యం కాని స్థితి ఉంది. ఈ వాస్తవాన్ని చాలాకాలం నుండీ వామపక్షాలు చెప్తూనే వున్నాయి. అయితే ఇటీవల ఇదే విషయాన్ని ఐరాస మానవ హక్కుల సలహా మండలి తన నివేదికలో చాలా స్పష్టంగా నొక్కి చెప్పింది.

ప్రపంచబ్యాంకు ఈ విధంగా అతి తక్కువ స్థాయిలో దారిద్ర్యరేఖను నిర్ణయించడం వెనక ప్రాతిపదిక ఏమిటి? ఏ కనీస అవసరాలను లెక్కలోకి తీసుకున్నారు? ఎంత స్థాయిలో పోషక విలువలున్న ఆహారం కనీసం రోజూ ఉండాలని నిర్ధారించారు? అసలు ప్రపంచబ్యాంకు ఇటువంటి అంశాలను వేటినీ ప్రాతిపదికగా తీసుకోనేలేదు. ప్రపంచంలోని అతి పేద దేశాలను పదిహేనింటిని ఎంచి (వాటిలో అత్యధిక దేశాలు ఆఫ్రికా ఖండంలోని సబ్ సహారా ప్రాంతానికి చెందినవి) ఆ దేశాలలోని జాతీయ పేదరిక స్థాయిని తీసుకుని వాటి సగటును

లెక్కించింది. ఆ సగటును అమెరికన్ డాలర్లలోకి మార్చింది. అది కూడా మారకపు రేటు కాదు సుమా, పిపిపి రేటు మాత్రమే. అలా 2011నాటికి 1.90 డాలర్లు దారిద్ర్య రేఖగా లెక్క తేల్చింది. ఈ దేశాలలో జాతీయ పేదరిక స్థాయిని ఏ ప్రాతిపదికన నిర్ణయించారన్నది ఇదమిత్థంగా తెలియదు. కాని చాలా ప్రభుత్వాలు తమ హయాంలో పేదరిక నిర్మూలన బ్రహ్మాండంగా సాగిందని గొప్పలు చెప్పుకోడానికి వీలుగా వాస్తవ పేదరికాన్ని బాగా తగ్గించి చూపుతారన్నది జగమెరిగిన సత్యం.

దేశ దేశానికీ ఉండే వ్యత్యాసాలను పరిగణనలోకి తీసుకోకుండా కేవలం కొన్ని దేశాల పేదరిక స్థాయిలనే లెక్కలోకి తీసుకోవడంలో అర్థం లేదు. నిజానికి చాలా దేశాలలో నిర్ణయించుకున్న జాతీయ పేదరిక రేఖలు ప్రపంచబ్యాంకు నిర్ణయించిన దానికన్నా బాగా పై స్థాయిలోనే ఉన్నాయి. మొత్తం మీద ఏ విధంగా చూసినా, ప్రపంచంలో వాస్తవ పేదరికం ప్రపంచ బ్యాంకు నిర్ధారించిన లెక్కల కన్నా బాగా హెచ్చు మోతాదులో ఉందని స్పష్టమవుతోంది.

మన దేశంలో జాతీయ శాంపిల్ సర్వే విధానం అమలులో ఉంది. ప్రతి ఐదేళ్ళకొకసారి విస్తృతంగాను, మధ్యలో ప్రతి ఏడూ పరిమితంగాను శాంపిల్ సర్వే నిర్వహిస్తారు. ఈ సర్వేలో వచ్చే సమాధానాలు అన్నీ వాస్తవ పరిస్థితిని చూపవు. అయినప్పటికీ, ఇటువంటి సర్వే కూడా చేయని దేశాలు చాలానే ఉన్నాయి. అందువలన ఆయా దేశాలలో దారిద్ర్య రేఖల నిర్ధారణ చాలా లోపభూయిష్టంగా ఉందని గమనించవచ్చు. చాలా దేశాలలో ధరల సూచికలు వాస్తవంగా పెరుగుతున్న జీవన వ్యయాన్ని వ్యక్తం చేయవు. మన దేశమే ఇందుకు ఒక ఉదాహరణ. ఇక్కడ కొన్ని సరుకుల జాబితాను నిత్యావసరాలుగా గుర్తించి వాటి ధరలలో వచ్చే ఎగుడుదిగుడులను నమోదు చేస్తారు. ఈ నిత్యావసరాల జాబితా నుండి కొన్ని పాతవి తగ్గించి కొత్తవి కలుపుతూ వుంటారు.

మన దేశంలో సరళీకరణ విధానాల అమలు ఫలితంగా విద్య, వైద్యం ఎక్కువగా ప్రైవేటు రంగంలోకి వచ్చాయి. ప్రైవేటు ఆస్పత్రులు ఎప్పటికప్పుడు ఫీజులు విపరీతంగా పెంచుతూనే వుంటాయి. కాని ప్రభుత్వ వైద్య శాలల్లో వైద్యసేవల రేట్లు పెద్దగా పెరిగిందేమీలేదు. అందువలన వాస్తవంగా వైద్యానికి పెట్టే ఖర్చు పెరుగుతున్నా ధరల సూచికలో ఆ పెరుగుదల కనిపించదు. ప్రభుత్వ ఆస్పత్రులలో సేవలు నానాటికీ అందుబాటులో లేకుండా పోవడం, అనివార్యంగా ప్రజలు ప్రైవేటు వైద్యసేవలపై ఆధారపడవలసి రావడం మనకు కనపడే వాస్తవం. కాని ధరల సూచికలో మాత్రం ఈ పెరిగే వైద్యసేవల ఖర్చు వ్యక్తం కాదు. పర్యవసానంగా దారిద్ర్యరేఖ గణనలో వాస్తవ పేదరికం కనపడదు. దరిద్రం తగ్గిపోతోందనే లెక్కలు సరైనవి కావని చెప్పడానికి ఇదొక ఉదాహరణ. మొదట్లో మన దేశంలో పేదరికానికి కొలబద్దగా తీసుకున్న

అంశాన్ని చూద్దాం. రోజుకు 2700 క్యాలరీల శక్తినిచ్చే ఆహారాన్ని పొందగలిగితే ఒక వ్యక్తి పేదరిక స్థాయికంటే ఎగువన ఉన్నట్టు లెక్క. ఈ ప్రమాణాన్ని కుదించి ఒక గ్రామీణ వ్యక్తి రోజుకు 2200 క్యాలరీల శక్తినిచ్చే ఆహారాన్ని పొందగలిగితే ఆ వ్యక్తి పేదరికంలో లేనట్టు భావించాలని, అదే విధంగా ఒక పట్టణ ప్రాంత వ్యక్తి రోజుకు 2100 క్యాలరీల శక్తినిచ్చే ఆహారాన్ని పొందగలిగి వుండాలని తిరిగి నిర్వచించారు. ఇలా చేసినందు వలన వాస్తవ పేదరికం తగ్గకపోయినా లెక్కల్లో మాత్రం బాగా తగ్గిపోయినట్టు కనపడుతుంది. ఇదేదో మన దేశానికే ప్రత్యేకమైన ధోరణి కాదు. నయా ఉదారవాద విధానాలు చేపట్టి నిత్యావసర సేవలను ప్రైవేటీకరించిన అన్ని దేశాలలోనూ ఇదే పరిస్థితి.

2011 ఏప్రిల్ నుండి 2019 డిసెంబరు మధ్య ప్రపంచం మొత్తం మీద చూసుకున్నప్పుడు వస్తువుల ధరలు, ముఖ్యంగా వ్యవసాయ, ఆహార ఉత్పత్తుల ధరలు 38 శాతం పడిపోయాయి. ధరలు తగ్గాయి గనుక పేదరికం తగ్గినట్టేనని ప్రపంచబ్యాంకు చెప్పుకుంటోంది. వ్యవసాయ, ఆహార ఉత్పత్తుల ధరలు తగ్గిపోవడమంటే మూడో ప్రపంచ దేశాల ప్రజల ఆదాయాలు తగ్గిపోవడం అని మనం గుర్తించాలి. ఆదాయాలు తగ్గాక ఇక వారు ఏ విధంగా ఎక్కువ కొనుగోలు చేయగలుగుతారు? ధరలు తగ్గినా, వినిమయం పెరగకపోవడం బట్టి ఈ సంగతి మనకు అర్థం ఔతుంది. వారి ఆదాయాలు తగ్గినా అప్పులు చేసి కొనుగోలు చేస్తారని, ఆ విధంగా పేదరికం లోనుంచి బైటపడతారని ఎవరైనా భావిస్తే అంతకన్నా అవకతవక వాదన ఇంకొకటి ఉండదు.

ఇటీవల నిరుద్యోగం ప్రపంచవ్యాప్తంగా పెరుగుతోంది. తీవ్రమౌతున్న పెట్టుబడిదారీ సంక్షోభానికి ఇది సంకేతం. మరీ ముఖ్యంగా మన దేశంలో కోవిడ్-19 సంభవించకముందే నిరుద్యోగం గత 45 సంవత్సరాలోకెల్లా అత్యధిక స్థాయిని చేరింది. నిరుద్యోగం పెరుగుతున్నకొద్దీ వినిమయ స్థాయి పడిపోతుంది, లేదా రుణభారం పెరిగిపోతుంది. మన దేశంలో సామాన్య ప్రజల వినిమయ స్థాయి తీవ్రంగా పడిపోతున్న వాస్తవాన్ని 2017-18లో జరిపిన శాంపిల్ సర్వే బయటపెట్టింది. 2011-12తో పోల్చితే 2017-18లో గ్రామీణ తలసరి వినిమయం ఏకంగా 9 శాతం తగ్గిపోయింది. ఈ వాస్తవాలు బయటకి రాకూడదనే మోడీ ప్రభుత్వం ఆ సర్వే వివరాలను బహిర్గతం చేయకుండా తొక్కిపెట్టింది. వాస్తవాలిలా ఉంటే ప్రపంచంలో పేదరికం తగ్గిపోతోందని చెప్పుకోవడం (చైనా, తూర్పు ఆసియా దేశాలను మినహాయించి) అర్థరహితం.



# అర్థాలే మారిపోతున్నాయి..!

**భా**వనలను ప్రచారంలో పెట్టే విషయంలోనూ వర్గ పోరాటం జరుగుతుంది. ప్రపంచ బ్యాంకు తరపున వకాల్తా పుచ్చుకున్న వారు వామపక్ష భావనలను ఎదుర్కోడానికి ఒక ప్రత్యేక పద్ధతిని అనుసరిస్తారు. వామపక్షాలు ఉపయోగించే భావనలనే వాళ్లూ వాడడం మొదలుబెడతారు. అదే భావనలకు వారు చెప్పే అర్థాలు మాత్రం పూర్తిగా భిన్నంగా, వామపక్షాలు చెప్పే అర్థాలకు పూర్తి వ్యతిరేకంగా ఉంటాయి. కొన్ని సందర్భాలలో వాటి అర్థాలు గందరగోళంగా మారిపోయి మొత్తానికి వామపక్షాల భావనలు యథాతథంగా ప్రజలకు అందకుండా పోతాయి.

'వ్యవస్థీకృత' అన్న పదాన్నే తీసుకుందాం. మొదట్లో దీనిని వామపక్షాలు మాత్రమే ఉపయోగించేవారు. మూడో ప్రపంచ దేశాలు స్వతంత్రం పొందాక ఏ విధాన అభివృద్ధి చెందాలన్న చర్చ ముందుకు వచ్చింది. ఆ రోజుల్లో మితవాద బూర్జువా సిద్ధాంతవేత్తలు అన్నింటినీ మార్కెట్ శక్తులకే వదిలిపెట్టేయ్యాలని వాదించేవారు. వామపక్షాలు ఇందుకు వ్యతిరేకం. మూడో ప్రపంచ దేశాల ప్రధానమైన సమస్య వ్యవస్థీకృతమైన స్వభావం కలిగివుందని, దానిని సమూలంగా మార్చాలని, భూమిని పున:పంపిణీ చేసేందుకు వీలుగా భూసంస్కరణలు వంటి వ్యవస్థీకృత మార్పులు తీసుకురావాలని వామపక్షాలు వాదించేవి. ఇప్పుడు ప్రపంచ బ్యాంకు ప్రచారం పుణ్యమా అని 'వ్యవస్థీకృత' అన్న పదానికి అర్థమే పూర్తిగా మారిపోయింది. మార్కెట్ శక్తులకే పెత్తనాన్ని పూర్తిగా వదిలి పెట్టేయడమే 'వ్యవస్థీకృత' సంస్కరణల సారాంశం అయిపోయింది! మౌలికమైన వ్యవసాయ సంబంధాల మార్పు అన్న అంశం ఎక్కడా తెరపైన లేకుండా పోయింది.

అలాంటిదే ఇంకో పదం 'సరళీకరణ'. మితవాద బూర్జువా వర్గం తాను ముందుకు తెచ్చిన ఆర్థిక విధానాలకు ఈ పేరు పెట్టి, దానిని వ్యతిరేకించే వారంతా

ఆధిపత్యవాదాన్ని, పెత్తనాన్ని ప్రబోధించే వారిగా చిత్రీకరించింది. సరళీకరణను వ్యతిరేకించడం అంటే నియంతృత్వ విధానం అని, ప్రజాస్వామ్య వ్యతిరేకత అని ప్రచారం చేసింది. వీళ్లు ప్రతిపాదించే సరళీకరణ వాస్తవానికి విచ్చలవిడిగా ప్రజల ఉమ్మడి సంపదను కొల్లగొట్టే దోపిడీ విధానం. దీని పర్యవసానంగా ప్రజానీకం చాలా కోల్పోతారు. చిన్న స్థాయి ఉత్పత్తిదారులు దివాళా ఎత్తుతారు. నిజానికి ఇవన్నీ అప్రజాస్వామికమైనవి. కాని 'సరళీకరణ విధానాల' పేర ఇవన్నీ చలామణీ అయిపోతున్నాయి!

వీటన్నింటికన్నా దారుణం 'పాపులిజం' అన్న పదం విషయంలో జరుగుతోంది ('పాపులిజం' అంటే ప్రజాకర్షక విధానాలు అని వాడుతున్నాం). మొదట్లో ఈ 'పాపులిజం' అన్న పదం రష్యాలో వాడుకలోకి వచ్చింది. రష్యా దేశాన్ని విప్లవాత్మకంగా మార్చి అభివృద్ధి చేయడం ఎలా అన్న అంశంపై చర్చ జరుగుతూండేది. ఆ చర్యల్లో నరోద్నిక్‌లు, గ్రామ కమ్యూన్లను నేరుగా సోషలిస్టు పద్ధతిలోకి మార్చాలని వాదించేవారు. బోల్షివిక్‌లు ఈ ప్రతిపాదనను వ్యతిరేకించారు. నరోద్నిక్‌లు భావిస్తున్నట్లు ఈ గ్రామ కమ్యూన్లలో పరిస్థితులు లేవని, పెట్టుబడిదారీ విధానాల అమలు పర్యవసానంగా గ్రామాల్లో సైతం వర్గ అంతరాలు ఏర్పడి స్థిరపడ్డాయని, అందుచేత నేరుగా వాటిని సోషలిజంలోకి తీసుకుపోవడం కుదరదని, ముందు భూ సంబంధాలలో మార్పు తేవడం అవసరమని బోల్షివిక్‌లు వాదించారు. నూతన సమాజ మార్పుకు రైతాంగం కాక కార్మిక వర్గమే నాయకత్వం వహించాలని వారు వాదించారు. లెనిన్ రచించిన 'రష్యాలో పెట్టుబడిదారీ అభివృద్ధి' అన్న గ్రంథంలో ఈ వాదన చేశారు.

ఈ వాదనకు భిన్నంగా, ప్రజలంతా ఒకే తరహాగా ఉన్నట్లు, వారిలో వివిధ వర్గాలు ఏర్పడనట్లు పరిగణించడాన్ని 'పాపులిజం' అని బోల్షివిక్‌లు అన్నారు. ఒక వైపు పెట్టుబడిదారీ విధానం ప్రజలను వర్గాలుగా విభజిస్తూ వున్నా, దానిని పట్టించుకోకుండా అన్ని వర్గాల వారినీ ఒకే గాటన కట్టి వ్యవహరించడాన్ని 'పాపులిజం' అన్నారు. అయితే కమ్యూనిస్టులు కూడా 'ప్రజలు' అని వాడే సందర్భాలు ఉన్నాయి. 'జనతా ప్రజాతంత్ర విప్లవం', 'జనతా ప్రజాతంత్ర ఆధిపత్యం' అని వాడతాం. ఇక్కడ ప్రజలు అంటే కొన్ని నిర్దిష్ట వర్గాల కూటమి అన్న అర్థంలో వాడతామే తప్ప అంబానీల నుంచి రోజు కూలీల వరకు అందరినీ కలిపి ఒకే గాటన కట్టేసే అర్థంలో మాత్రం కాదు.

కాని ఇప్పటి రోజుల్లో 'పాపులిజం' అనేది వేరే అర్థంలో వాడుతున్నారు. సమాజం లోని కొద్దిమంది ఉన్నత వర్గాల వారికి భిన్నంగా ఉండే తక్కిన ప్రజానీకాన్ని అంతటినీ కలిపి 'ప్రజలు' అని వాడుతున్నారు. దీంతో రకరకాలుగా 'పాపులిజం'

అన్న పదం వాడకానికొచ్చింది. సంపదని పున:పంపిణీ చేసే సంక్షేమ పథకాలూ పాపులిజమే. దేశంలో మెజారిటీ మతస్థుల మనోభావాలను, సెంటిమెంట్లను రాజకీయాల్లో వాడుకొంటే అదీ పాపులిజమే.

సంక్షేమ పథకాలు వంటివి 'వామపక్ష పాపులిజం' అయితే 'హిందూత్వ' రాజకీయాలు 'మితవాద పాపులిజం' అయ్యాయి. ఈ రకంగా 'పాపులిజం' అన్న పదాన్ని వాడుతూ తాము మాత్రం ఈ రెండు రకాల పాపులిజానికీ దూరంగా ఉంటూ నయా ఉదారవాద విధానాలను పక్కాగా అమలు జరుపుతామని బూర్జువా వర్గం చెప్పుకుంటూ సమర్థించుకుంటోంది.

సంక్షేమ పథకాలను చిన్నచూపు చూస్తూ, వాటి ద్వారా కొంత సంపద, పేదల మధ్య పున:పంపిణీ అవుతోందన్న సత్యాన్ని మరుగుపరుస్తూ, ఇదంతా 'పాపులిజం' అని కొట్టి పారెయ్యడం జరుగుతోంది. ఈ సంక్షేమ పథకాలు వృధా ఖర్చు అని, కార్పొరేట్లను ప్రోత్సహించే విధంగా నిధులను మళ్లిస్తే ఆ సంపద ఆ కార్పొరేట్ల కోశాల నుండి దానంతట అదే పొంగిపొర్లి ప్రవహించి పేదలకు పంపిణీ అవుతుందని ఒక బోగస్ సిద్ధాంతాన్ని బూర్జువా సిద్ధాంతవేత్తలు పదేపదే ప్రచారం చేస్తున్నారు.

ఇంకోవైపు కొందరు వామపక్షవాదులు సైతం 'పాపులిజం' అనే పదాన్ని మితవాద శక్తులు అనుసరించే మతతత్వ, జాతి దురహంకార విధానాలకు పర్యాయపదంగా వాడేస్తున్నారు. ఆ క్రమంలో సంక్షేమ పథకాల కోసం, సంపద పున:పంపిణీ కోసం పోరాడే వామపక్షాల విధానాలతో మితవాద విధానాలను, ఆధిపత్య భావజాలాన్ని కలగాపులగం చేసేస్తున్నారు. ఈ రకమైన వైఖరి మితవాద శక్తులు ముందుకు తెచ్చే వాదనలు, ఉద్యమాల వర్గ స్వభావాన్ని మరుగుపరిచి వేస్తుంది. దానివలన ఆ మితవాద శక్తుల ప్రమాదం పట్ల స్పష్టత లేకుండా పోతుంది. ఈ మతతత్వం అనేది ఒక వర్గానికి, దాని ప్రయోజనాలకు ప్రతినిధిగా ముందుకొచ్చిన పరిణామంగా గుర్తించే బదులు, ఏదో యాదృచ్ఛికంగా ఎన్నికల ఎత్తుగడల కోసం అనుసరించిన విధానంగా భావించే అవకాశం వుంది. మతతత్వపు వర్గ పునాది కనపడకుండా మరుగున పడిపోతుంది.

ఇలాంటిదే 'జాతీయత' అనే పదం కూడా. మతతత్వ శక్తులు ముందుకు తెచ్చే సిద్ధాంతాన్ని, వాదనలను 'జాతీయవాదం' గా కొందరు వామపక్షవాదులు సైతం అభివర్ణిస్తున్నారు. సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాట క్రమంలో ఆవిర్భవించిన జాతీయవాదాన్ని కాస్తా ఆ సామ్రాజ్యవాదులకే బంటుగా వ్యవహరించే మతతత్వవాదులకి ఆపాదించడం జరుగుతోంది. సామ్రాజ్యవాద వ్యతిరేకత అనేది జాతీయవాదానికి ఆయువుపట్టు. దానిని మరిచిపోయి మతతత్వవాదులకి ఆ పదాన్ని

ఆపాదించడం వలన సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటానికే తీవ్ర నష్టం కలుగుతుంది. సామ్రాజ్యవాద బోధిత ప్రపంచీకరణకు పరోక్షంగా ఊతం ఇచ్చినట్లు అవుతుంది. అంతర్జాతీయ ఫైనాన్సు పెట్టుబడి ఆధిపత్యం నుండి విడగొట్టుకుని జాతీయ దృక్పథంతో వ్యవహరించాలన్న ప్రత్యామ్నాయ సిద్ధాంతాన్ని నీరుగార్చినట్టవుతుంది. సామ్రాజ్యవాదులతో చేయి కలిపే మోడీది జాతీయవాదం అయినప్పుడు దానిని వ్యతిరేకించేవారు కాస్తా జాతి వ్యతిరేకులైపోతారు!

కనుక జాతీయవాదం, జాతీయత అన్న పదాలను అన్ని సందర్భాలలో, అన్ని దేశాలలో ఒకే అర్థంతో చూడలేం. జర్మనీలో హిట్లర్ ప్రచారం చేసిన జాతీయవాదానికి, మన దేశంలో గాంధీజీ ప్రచారం చేసిన జాతీయవాదానికి ఏమైనా పోలిక వుందా?

కొన్నిసార్లు ఈ 'జాతీయవాదాన్ని', 'పాపులిజాన్ని' కలగలిపి 'పాపులిస్ట్ జాతీయవాదం' అంటూ వాడేస్తున్నారు కొందరు. విడివిడిగానే ఈ రెండు పదాలు వాడుతున్న తీరు గందరగోళానికి దారితీస్తుంటే, రెండింటినీ కలిపేసి గందరగోళాన్ని మరింత పెంచుతున్నారు ఇలాంటివాళ్లు.

సంపదను పున:పంపిణీ చేసే సంక్షేమ విధానాల పట్ల, ఆ విధానాలు ఏ వర్గాలకు మేలు చేస్తాయన్న అంశం పట్ల వామపక్షాలకు స్పష్టమైన అవగాహన వుంది. అదేవిధంగా ఫాసిస్టు తరహా జాతీయవాదం బడా కార్పొరేట్లకు, సామ్రాజ్యవాదులకు మాత్రమే ప్రాతినిధ్యం వహిస్తుంది తప్ప విస్తృత ప్రజానీకానికి మాత్రం కాదన్న స్పష్టత కూడా వామపక్షాలకు ఉంది. కాని కొందరు లిబరల్ బూర్జువా సిద్ధాంతవేత్తల పుణ్యమా అని ఈ పదాలు వాటి వెనక దాగివున్న వర్గ ప్రయోజనాలతో నిమిత్తం లేకుండా గందరగోళాన్ని పెంచే రీతిలో వాడకంలోకి వచ్చేశాయి. ఈ గందరగోళం నుంచి కనీసం వామపక్షవాదులన్నా ముందు దూరంగా ఉండాలి కదా! లేకపోతే మన సిద్ధాంత పోరాటంలో వాడటానికి మనకి ఆయుధాలే లేకుండా పోయే ప్రమాదం వుంది.



# ఆర్థిక సంక్షోభంలో స్టాక్ మార్కెట్ వృద్ధి?

అమెరికాలో తలకిందుల వ్యవహారం సాగుతున్నట్టు అనిపిస్తోంది. కరోనా వైరస్ అక్కడ స్వైరవిహారం చేస్తోంది. అది ఇప్పుడిప్పుడే అదుపులోకి వచ్చేట్టు కనపడడం లేదు. ఆర్థిక వ్యవస్థ దాదాపు కుప్పకూలిపోయింది. ఏకంగా 4 కోట్ల మంది నిరుద్యోగ భృతి కోసం దరఖాస్తు చేసుకున్నారు. సమాజంలో పురివిప్పిన జాత్యహంకారానికి వ్యతిరేకంగా వేలాదిమంది వీధుల్లోకి వచ్చి నిరసనలు తెలియజేస్తున్నారు. చైనాతో సంబంధాలు పూర్తిగా దిగజారాయి. తత్వవేత్త కార్నెల్ వెస్ట్ చెప్పినట్టు అమెరికా ఒక విఫలమైన సామాజిక ప్రయోగానికి ప్రతీకగా ఉండే అన్ని లక్షణాలనూ కనపరుస్తున్నది. అయినప్పటికీ అమెరికన్ స్టాక్ మార్కెట్‌లో కనపడుతున్న స్టాక్‌మార్కెట్ వృద్ధి ఒక వాస్తవం. అమెరికన్ స్టాక్‌మార్కెట్ సూచిక 'నాస్‌డాక్' మార్చి 23 నుంచి 40 శాతం పైగా పెరుగుదలను నమోదు చేసింది. ఒక వ్యాఖ్యాత "ఆల్ టైం రికార్డు పెరుగుదలకు చేరువలో ఉన్నాం" అని అన్నాడు.

వాస్తవ ఆర్థిక వ్యవస్థ వృద్ధికి ఒక కొలమానంగా స్టాక్ మార్కెట్ ఉంటుందన్న భ్రమ దీంతో మొత్తానికి కరిగిపోయింది. కొంతమంది ఇప్పటికీ ఇందుకు ఒప్పుకోకపోవచ్చు. ఆర్థిక వ్యవస్థ ఒక పక్క దిగజారుతూ వుంటే ఇంకొక పక్క స్టాక్‌మార్కెట్ సూచీ పెరగడం తాత్కాలికంగా కనిపించే ఒక పెడలక్షణం మాత్రమేనని, త్వరలో గనుక వాస్తవ ఆర్థిక వ్యవస్థ కోలుకుని పెరగనట్టైతే ఈ స్టాక్ మార్కెట్ బుడగ పేలిపోవడం ఖాయమని వారంటారు. అయితే మనం ప్రస్తుతం నయా ఉదారవాద కాలంలో ఉన్నామని, ద్రవ్యపెట్టుబడి ఆధిపత్యం చెలాయించడం ఈ కాలపు ప్రధాన లక్షణమని వారు గుర్తించడంలేదు.

నయా ఉదారవాద ఆర్థిక వ్యవస్థలో ఎప్పుడూ ద్రవ్యలోటును అదుపులో ఉంచుతారు. మరోవైపు పెట్టుబడిదారులపై విధించే పన్నులనూ పెరగకుండా కట్టడి

చేస్తారు. అంతకు ముందునాటి కార్పొరేట్ పన్నులను సైతం తగ్గిస్తారు. మాంద్యం గనుక ఏర్పడితే దానిని అధిగమించే ద్రవ్య విధానం అంటూ ఏదీ ఉండదు (అంటే అదనంగా సంపన్నులపై పన్నులు వేసి అదనపు ఆదాయాన్ని రాబట్టడం వంటివి). దాంతో ఆ మాంద్యం నుండి బైట పడడానికి డబ్బు చెలామణీ విధానమే పాలకులకు మార్గాంతరం అవుతుంది. పైగా ఆ డబ్బు చెలామణీ విధానాన్ని ఒక వింతైన కొత్త పద్ధతిలో అమలు చేస్తారు.

మన అర్థశాస్త్ర పాఠ్య పుస్తకాలలో ఈ మాంద్యం పరిస్థితులలో ద్రవ్య చెలామణీ విధానం ఎలా ఉండాలని చెప్తారు? మాంద్యం సమయంలో దానిని అధిగమించడానికి సాధారణంగా అనుసరించే డబ్బు చెలామణీ విధానంలో వివిధ పద్ధతుల ద్వారా పరిశ్రమలకు అప్పు తక్కువ వడ్డీకి దొరికేటట్టు చూస్తారు. అంతవరకూ అధిక వడ్డీల కారణంగా నష్టాలు వస్తాయని పరిశ్రమల్లో పెట్టుబడులు పెట్టేందుకు ముందుకు రాని వారంతా వడ్డీలు తగ్గాయి గనుక ఇప్పుడు పెట్టుబడులు పెడతారు. పరికరాలు కొనుగోలు చేస్తారు. నిర్మాణాలు చేపడతారు. మరోవైపు తక్కువ వడ్డీకి రుణాలు దొరుకుతున్నందున వినిమయ వస్తువులను కొనుగోలు చేసేవారు మరింత ఎక్కువగా కొనుగోలు చేస్తారు. ఒకవైపు పెట్టుబడులు పెరిగినందున ఉపాధీ పెరుగుతుంది, మరోవైపు కొనుగోలు పెరిగి డిమాండూ పెరుగుతుంది. ఫలితంగా మాంద్యం నుండి బైట పడవచ్చు. మన అర్థశాస్త్ర పాఠ్య గ్రంథాలలో చెప్పేది ఇదే.

అయితే, మాంద్యం ఏర్పడడానికి ప్రధాన కారణం ఉత్పత్తి అయిన సరుకులకు డిమాండు లేకపోవడం. కొనుగోలుదారుల వద్ద సరుకులను కొనే శక్తి లేకపోతే చౌకగా రుణాలను ఇచ్చినంత మాత్రాన సరుకులను కొనడానికి అందరూ ముందుకు రారు. నిరుద్యోగం విపరీతంగా పెరుగుతున్నప్పుడు వారంతా ఈ చౌక రుణాలను పొందనూ లేరు, మార్కెట్‌లో నెలకొన్న మాంద్యం తగ్గనూ తగ్గదు. అందుచేత పాఠ్యపుస్తకాలలో చెప్పేదానికి, వాస్తవంగా జరిగేదానికి పొంతన లేదు.

అయితే నయా ఉదారవాద దశలో జరిగేది వేరు. ఇక్కడ రిజర్వు బ్యాంకు అమలు చేసే డబ్బు చెలామణీ విధానం పాఠ్య పుస్తకాల్లో చెప్పినట్టు మార్కెట్ లోకి డబ్బును ఏ విధంగా పంపాలన్న అంశంపై దృష్టి పెట్టదు. షేర్ల ధరలను నిలబెట్టడానికి, అవి నిరంతరం పెరుగుతూ వుండేలా చూడడానికి ప్రాధాన్యతనిస్తుంది.

'అమెరికన్ ఫెడరల్ రిజర్వు'కు అధ్యక్షుడిగా అలన్ గ్రీన్‌స్పాన్ ఉన్న కాలంలో సాఫ్ట్‌వేర్ రంగ కంపెనీల షేర్ల విలువలు పతనం అయినప్పుడు (దీనినే 'డాట్ కామ్ బబుల్' అంటారు) వడ్డీ రేట్లు తగ్గించారు. ఆ కాలంలో అనుసరించిన డబ్బు చెలామణీ విధానం ఫలితంగా రియల్ ఎస్టేట్ రంగంలో పెరుగుదల మొదలైంది (హౌసింగ్

బబుల్). అంతే తప్ప మాంద్యానికి మూల కారణం మాత్రం పరిష్కారం కాలేదు. ఆ మాంద్యం పెరుగుతూనే వచ్చింది. ఇప్పుడు రిజర్వుబ్యాంకులు అనుసరించే డబ్బు చెలామణీ విధానం స్టాక్ మార్కెట్ పతనం కాకుండా చూడడానికే ప్రాధాన్యతనిస్తుంది. ఆయా కంపెనీలు వాస్తవంగా మార్కెట్‌లో లాభాలను ఆర్జించగలుగుతున్నాయా లేవా అన్నదానితో నిమిత్తం లేకుండానే వాటి షేర్లు పెరుగుతూ వుండేలా చూస్తుంది. అంటే వాస్తవ ఆర్థిక వ్యవస్థ పెరుగుదల లేదా తరుగుదలతో నిమిత్తం లేకుండా ద్రవ్య పెట్టుబడి వృద్ధి చెందుతూపోయేలా డబ్బు చెలామణీ విధానం ఉంటుంది (మన ఆర్థిక మంత్రి ప్రకటించిన 20 లక్షల కోట్ల ప్యాకేజీలో ప్రజల కొనుగోలు శక్తిని పెంచే చర్యలేవీ లేకుండా అత్యధిక భాగం కార్పొరేట్లకే కట్టబెట్టడం చూస్తే పై విషయం స్పష్టం అవుతుంది).

ద్రవ్య పెట్టుబడి పూర్తిగా పైచేయి సాధించిందన్న వాస్తవం దీనిని బట్టి మనం గ్రహించవచ్చు. ఇప్పుడు అమెరికన్ ఫెడరల్ రిజర్వు వడ్డీ రేట్లను దాదాపు సున్నాకు తెచ్చింది. గవర్నమెంటు బాండ్లను కొనడమే గాక కార్పొరేట్లకు నేరుగా రుణాలను కూడా ఇవ్వడానికి సిద్ధపడింది. అంటే ఆ కార్పొరేట్ కంపెనీలు తమ వ్యాపారాల్లో నిలదొక్కుకుంటున్నాయా లేక దెబ్బ తింటున్నాయా అన్నదానితో నిమిత్తం లేకుండానే వాటికి ఎప్పుడు అవసరం అయితే అప్పుడు రుణం పేరుతో రిజర్వుబ్యాంకు మద్దతు ఇస్తూ వుంటుందన్న మాట. అటువంటప్పుడు ఆ కంపెనీల షేర్లను కొనుగోలు చేయడానికి ఎవరికైనా అభ్యంతరం ఎందుకు ఉంటుంది? ఆ విధంగా రిజర్వు బ్యాంకు వాస్తవ ఆర్థిక వ్యవస్థ ఉత్థాన, పతనాలతో నిమిత్తం లేకుండా స్టాక్ మార్కెట్‌లో షేర్లు మాత్రం ఒక స్థాయికి దిగువకు పడిపోకుండా గ్యారంటీ చేస్తోంది.

దీని పర్యవసానాలేమిటి? మొదటిది–షేర్ మార్కెట్‌లో పెరుగుదలను గ్యారంటీ చేసినందువలన వాస్తవ ఆర్థిక వ్యవస్థలో ఎటువంటి పెరుగుదలా ఉండదు. కార్పొరేట్లకు ఎంత చౌకగా రుణాలిచ్చినా అవి ఆ డబ్బును పెట్టి ఉత్పత్తిని పెంచేందుకు ముందుకు రావు. ప్రజల కొనుగోలుశక్తి పెరగకుండా ఉత్పత్తి పెంచితే అవి అమ్ముడుపోవు. పైగా తమ అప్పుల వాయిదాలను చెల్లించడానికి మరింత అప్పు చేసే సంస్థలు పెట్టుబడినెలా పెంచగలవు?

అదే విధంగా, ఇప్పటికే అప్పుల్లో కూరుకుపోయివున్న వినిమయదారులు చౌక రుణాలు లభించినంత మాత్రాన తమ వినిమయాన్ని అదనంగా పెంచివేయరు. మహా అయితే ప్రస్తుతం ఏ మోతాదులో ఖర్చు చేస్తున్నారో, అదే స్థాయిని కొనసాగిస్తారు. దానివలన మార్కెట్‌లో డిమాండ్ అదనంగా ఏమీ పెరగదు. అందువలన మాంద్యం

లోకి ఆర్థిక వ్యవస్థ కూరుకుపోతూనే వుంటుంది.

ప్రస్తుతం కోవిడ్-19 ని ఎదుర్కోవడానికి ప్రభుత్వాలు చేపట్టిన చర్యలు ఈ సంక్షోభ కాలంలో ఆర్థిక వ్యవస్థకు కొద్దిపాటి ఊరటనివ్వడం జరుగుతుంది. కాని ఆ తర్వాత కూడా మొత్తంగా డిమాండ్‌ను పెంచే దిశగా ప్రభుత్వం ఆర్థిక చర్యలను తీసుకోవాలి.

రెండో పర్యవసానం-ఒకసారి అమెరికన్ ఫెడరల్ రిజర్వు ఈ విధంగా తన దేశ స్టాక్ మార్కెట్‌లో పెరుగుదలను గ్యారంటీ చేశాక ఇక తక్కిన అన్ని దేశాలూ అదే మార్గాన నడవక తప్పదు. ఒకవేళ భారతదేశంలో గనుక ప్రభుత్వం స్టాక్ మార్కెట్‌ను పట్టించుకోకపోతే, ఇక్కడ షేర్ల విలువలు గనుక పడిపోవడం మొదలుబెడితే, ఇక్కడి నుంచి ద్రవ్య పెట్టుబడి బైటకు వెంటనే పారిపోతుంది. ఇక ఈ తర్వాత మన విదేశీ చెల్లింపుల లోటు పెరిగిపోయి మన ఆర్థిక వ్యవస్థ మరింతగా ఇబ్బందుల్లో కూరుకుపోతుంది. అంటే మన రిజర్వు బ్యాంకు విదేశీ నిల్వలను తగ్గిపోకుండా చూసుకొవడం, రూపాయి విలువ పడిపోకుండా చూసుకోవడం మాత్రమే కాదు, మొత్తం స్టాక్ మార్కెట్ పడిపోకుండా చూసుకోవాలి.

అంటే వాస్తవంగా దేశ ఆర్థిక వ్యవస్థ దిగజారుతున్నా, దానిని సరిచేసేందుకు జోక్యం కల్పించుకోవడం బదులు, అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడి, దాని తాబేదార్లుగా ఉన్న దేశీయ కార్పొరేట్లు దెబ్బతినకుండా చూసుకోవడమే మన రిజర్వు బ్యాంకు ప్రథమ, ప్రధాన కర్తవ్యంగా ఉంటుందన్న మాట. ఈ వైఖరి వలన అతి దారుణంగా దెబ్బ తినేది శ్రామిక ప్రజలే. నిరుద్యోగం మరింతగా పెరిగిపోయి, పేదరికమూ పెరిగిపోతుంది. దీనిని నివారించేలా ప్రభుత్వం చర్యలను తీసుకోవాలని, మరింత ఎక్కువగా సంక్షేమ చర్యలను తీసుకోవాలని శ్రామిక వర్గం డిమాండు చేయాలి. అందుకోసం ఉద్యమించాలి. అమెరికా లోను, ఇతర దేశాలలబూోను ఇప్పటికే ప్రజలు సమానత్వాన్ని కోరుతూ వీధుల్లోకి వచ్చి పోరాడుతున్నారు. మన దేశంలో కూడా అటువంటి పోరాటాలు మొదలవడానికి ఎంతోకాలం పట్టదు. ఇలాగే కార్పొరేట్ల సేవలో ఎల్లకాలమూ తరించవచ్చని గనుక మోడీ ప్రభుత్వం అనుకుంటూ వుంటే అది దాని వెర్రితనమే అవుతుంది.



# పెట్టుబడిదారీ విధానం-సంపద వారసత్వం

పెట్టుబడిదారుడు తన వారసుడికి సంపదను తన తదనంతరం కట్టబెట్టగలగడం అనేది ఆ వ్యవస్థ మనుగడకు అత్యంత కీలకం అని తరచూ భావిస్తూ వుంటారు. అటువంటిదానికి అవకాశం గనుక లేకపోయినట్లైతే పెట్టుబడిదారుడు ముందుకు పోవడానికి ప్రోత్సహించే అంశం వేరే ఏదీ ఉండదని, అప్పుడు ఆ వ్యవస్థ తన చురుకుదనాన్ని కోల్పోతుందని వారు అనుకుంటారు. ఇంతకన్నా అవాస్తవికమైనది మరొకటి ఉండదు. నిజానికి బూర్జువా వర్గం ఆస్తి హక్కును కలిగివుండడాన్ని సమర్థించుకోవడానికి చేసే వాదనలకు వారసత్వం ద్వారా ఆస్తి సంక్రమించడం అనేది విరుద్ధం.

పెట్టుబడిదారులకు కొన్ని అరుదైన లక్షణాలు ఉంటాయని, వాటిని వినియోగించగలిగితేనే దేశం సంపద్వంతం అవుతుందని, అందువలన ఆ లక్షణాలను వినియోగించుకోవడానికి వీలుగా పెట్టుబడిదారులకు తగిన ప్రతిఫలం ముట్టాలని పెట్టుబడిదారీ ఆస్తి హక్కును సమర్థించేవారు చెప్తారు. ఆ "అరుదైన లక్షణాలు" ఏమిటో స్పష్టంగా చెప్పే విషయంలో మాత్రం ఈ సమర్థకుల మధ్య ఏకాభిప్రాయం లేదు. ఉత్పత్తి జరిగే క్రమాన్ని పర్యవేక్షించడంలో ఆ ప్రత్యేక లక్షణం ఉంటుందని అనుకుందామా అంటే ఆ పనిని జీతానికి పని చేసే సూపర్‌వైజర్లు చేస్తారు. అందుకు గాను వారికి జీతాలు ముడతాయే తప్ప లాభాలలో వాటా ఏమీ దక్కదు (ఆ కంపెనీలో వారికి షేర్ల రూపంలో కొంత ఆస్తి ఉంటేనే తప్ప). "పరిశ్రమలను నడిపేది పెట్టుబడిదారులు కాదు, ఆ పని వ్యవస్థీకృత సాంకేతికత ద్వారా జరుగుతుంది" అని జాన్ కెన్నెత్ గాల్బ్రియత్ అన్నారు.

పెట్టుబడిదారులకు వుండే "వేటాడే జంతు ప్రవృత్తి" (యానిమల్ స్పిరిట్స్) గురించి కీన్స్ ప్రస్తావించాడు. పోనీ, అదే వారి ప్రత్యేక, అరుదైన లక్షణం అని

అనుకుందామా అంటే ఆ లక్షణం ఎంత మొత్తాన్ని పెట్టుబడిగా పెడతాడో దానిని నిర్ణయిస్తుంది తప్ప అసలు ఆ పెట్టుబడిదారుడికి ఆ సంపద ఎలా వచ్చిందో, అది ఆస్తి ఏవిధంగా అయిందో వివరించదు.

పెట్టుబడి పెట్టడం ద్వారా పెట్టుబడిదారుడు రిస్క్ తీసుకుంటాడు గనుక అతనికి ఆ ప్రతిఫలం ముట్టాల్సిందే అని వాదించేవారున్నారు. కాని నిజానికి రిస్క్ తీసుకునేది పెట్టుబడిదారుడు కాదు. బ్యాంకుల ద్వారా పోగుబడిన ఇతరుల సొమ్ము ఆ పెట్టుబడిదారుల దగ్గరకు చేరుతుంది. దానిని అతడు పెట్టుబడి పెడతాడు. ఆ వెంచర్ గనుక దెబ్బ తింటే దాని పర్యవసానం అనుభవించేది ఆ ఇతరులే. అయితే ఈమధ్య కాలంలో ప్రభుత్వాలు ఆ బ్యాంకులను ఆదుకోడానికి నిధులు వెచ్చిస్తున్నాయి. అలా వెచ్చించడం అంటే ఆ రిస్క్ ప్రభుత్వం తీసుకుంటోందని భావించాలి. అంటే సమాజమే ఆ రిస్క్ తీసుకుంటున్నట్టు అవుతుంది తప్ప పెట్టుబడిదారుడు కాదు. అంటే రిస్క్ తీసుకునే గుణం పెట్టుబడిదారుడికి లేదు.

పెట్టుబడిదారుడు తన ఆదాయాన్ని ఊరికే ఖర్చు చేసేయకుండా పొదుపు చేసి కూడబెట్టి దానిని పెట్టుబడిగా పెడతాడు. ఆ విధంగా ఖర్చు చేయకుండా త్యాగం చేశాడు కనుక అతగాడికి ప్రతిఫలం ముట్టాల్సిందే అని కొందరు వాదిస్తారు. త్యాగం అంటే ఏమిటి? అన్న తాత్విక చర్చలోకి పోనవసరం లేకుండానే ఆ వాదనను తిప్పికొట్టవచ్చు. పెట్టుబడి నుండి పొదుపు వస్తుంది తప్ప పొదుపు నుండి పెట్టుబడి రాదు. పరిశ్రమల్లో అంతవరకూ పూర్తి సామర్ధ్యాన్ని వినియోగించుకోకుండా ఉన్న సందర్భాల్లో ఆ సామర్ధ్యాన్ని మరింత ఎక్కువగా వినియోగించుకోవడానికి అదనంగా పెట్టుబడి పెడతారు. ఆ పెట్టుబడి చలామణీ అయ్యే క్రమంలో పొదుపుకు కావలసిన ధనం సమకూరుతుంది. ధరలు పెరిగి కార్మికుల నిజ వేతనాలు పడిపోయినపుడు అలా చౌకగా కార్మికుల శ్రమను పొందగలిగినందు వలన పెట్టుబడిదారుల వద్ద పొదుపుకు ధనం సమకూరుతుంది. అనేకమంది అనేక కారణాల రీత్యా పొదుపు చేస్తారు. అలా చేయడమే “త్యాగం” అయినట్టు పరిగణించడం, అందుకు వారికి ప్రతిఫలం ముట్టాలని అనడం పెట్టుబడిదారీ వ్యవస్థ నడిచే విధానానికి సరిపడని వాదన.

పెట్టుబడిదారులు ధైర్యశాలురని, అందుచేత కొత్త కొత్త ప్రక్రియలను ప్రవేశ పెట్టగలరని, అటువంటి “ధైర్యం” కొద్దిమందికే ఉంటుందని, అందుకే వారికి తగిన ప్రతిఫలాన్ని ముట్టజెప్పాలని మరో వాదన ఉంది. అయితే, ఎటువంటి కొత్త ప్రక్రియనూ ప్రవేశ పెట్టకుండా సాధారణ పునరుత్పత్తినే కొనసాగించినా కూడా పెట్టుబడిదారుడి వద్ద ఉండే ఆస్తి లాభాలను తెచ్చిపెడుతూనే వుంటుంది. అందుచేత ఈ వాదన

కూడా చెల్లదు.

అయితే, పెట్టుబడిదారుడికి ఆస్తి ఎలా సమకూరిందన్నది కాని, లాభం ఎందుకివ్వాలన్నది కాని ప్రస్తుత చర్చనీయాంశం కాదు. పెట్టుబడిదారులకు కొన్ని అరుదైన లక్షణాలు ఉంటాయని, అందువలన వారి వద్ద ఆస్తి పోగుపడడం గాని, వారికి లాభం చేకూరడం గాని సమర్ధనీయమేనన్న వాదనలు సరైనవే అని మాటవరసకు అనుకుందాం. అటువంటి ప్రత్యేక లక్షణాలు ఏవీ లేకున్నా వారి వారసులకు ఈ ఆస్తి వారసత్వంగా సమకూరడాన్ని ఏ విధంగా సమర్ధిస్తారు? అట్లా సమర్ధించడం ద్వారా పెట్టుబడిదారుడికి ప్రత్యేక లక్షణాలు వుంటాయన్న వాదనను పరోక్షంగా తిరస్కరించినట్టు అవుతుంది కదా? కనుక వారసత్వం ద్వారా ఆస్తి సమకూరడం అనేది పెట్టుబడిదారుడు ఆస్తి కలిగి వుండడాన్ని సమర్ధించే వాదనలను పూర్వపక్షం చేస్తుంది.

ఒక వాదన ఇంకా ఉండిపోయింది. పెట్టుబడిదారుడికి గనుక ఆస్తిని తన వారసులకు బదలాయించే హక్కు లేకపోతే అతగాడు తన ప్రత్యేక లక్షణాలను ప్రదర్శించడానికి ప్రోత్సాహకం అంటూ (ఇన్సెంటివ్) ఏదీ ఉండదు కదా అన్నదే ఆ వాదన. అయితే ఈ వాదన నిజానికి వారసత్వాన్ని సమర్ధించేదిగా కాక, పెట్టుబడిదారుడి బ్లాక్‌మెయిల్‌ను సమర్ధించేదిగా ఉంది. "వారసత్వ హక్కును గనుక అంగీకరించకపోతే నా ప్రత్యేక లక్షణాలను బైటపెట్టను" అని పెట్టుబడిదారుడు సమాజాన్ని బెదిరించినట్టు ఉంది ఈ వాదన. నైతికంగా ఈ వాదన సమర్ధనీయం కాదు. పైగా ఇది తర్కానికి నిలిచేది కాదు. వారసత్వ హక్కు లేనట్లయితే సమాజంలో సృజనాత్మకత లేకుండా పోతుందా? చొరవ లేకుండా పోతుందా? నూతన ఆవిష్కరణలు లేకుండా పోతాయా? నాకు వారసత్వ హక్కు లేకుండా పోయిందని ఒకడు తన చొరవను, సృజనను ప్రదర్శించడం మానుకుంటే, అతనికి బదులు ఆ లక్షణాలను ప్రదర్శించే మరో వ్యక్తి ముందుకు వస్తాడు – అతగాడికి ఎటువంటి వారసత్వమూ సంక్రమించకపోయినా సరే (మార్కెట్‌లో పోటీ ఉంటుంది కదా). అందుచేత బూర్జువా తర్కం ప్రకారం చూసినా, వారసత్వ హక్కుకు ఎటువంటి తార్కిక సమర్ధనా లేదు.

అందుచేతనే, పెట్టుబడిదారులకు పూర్తిగా అనుగుణంగా ఉండే ప్రస్తుత నయా ఉదారవాద శకంలో కూడా అనేక పెట్టుబడిదారీ దేశాల్లో వారసత్వ పన్ను చాలా ఎక్కువ శాతంలో విధిస్తున్నారు. జపాన్‌లో వారసత్వ పన్ను 50 శాతం. అమెరికాలో కూడా 40 శాతం ఉంది. చాలా యూరోపియన్ దేశాలలో 40 శాతం వరకూ ఉంది. ఈ పన్నును ఎగ్గొట్టేవాళ్ళు ఎక్కువగానే ఉన్నప్పటికీ, వారసత్వ పన్ను ఉండాలనే సూత్రాన్ని మాత్రం విస్తృతంగానే ఆమోదిస్తున్నారు.

మన దేశంలో మాత్రం ఒక వైపు ఆర్థిక అసమానతలు విపరీతంగా పెరిగిపోతున్నా, సంపద పన్ను గాని, వారసత్వ పన్ను గాని ఉన్నట్టు గట్టిగా చెప్పుకోడానికి లేదు. ఈ విషయమై పబ్లిక్‌లో ఎటువంటి చర్చ కూడా జరగడంలేదు. రాజ్యాంగం మనకు సమాన అవకాశాలను కల్పిస్తామని హామీ ఇచ్చినా, చాలా మంది దృష్టిలో సమాన అవకాశాలు అనేవి ఆచరణలో సాధ్యంకాని ఒక కలగానే ఉంది. అందుచేత ఆ విషయాన్ని విడిచిపెట్టి తమ దుర్భర పరిస్థితుల నుండి ఎంతోకొంత ఊరట కలిగించే సహాయ చర్యలనే వారు కోరుకుంటున్నారు. కాని ప్రజాస్వామ్యం మనగలగాలి అంటే సమాన అవకాశాలు ఉండితీరాలి (ఇది పెట్టుబడిదారీ వ్యవస్థ ఉండగా సాధ్యం కాదు). సమాన అవకాశాలు కల్పించే వైపుగా అడుగు పడాలంటే సంపదలో ఉన్న అసమానతలను తగ్గించడం, వారసత్వం ద్వారా సంపద సంక్రమించే సూత్రాన్ని రద్దు చేయడం మొదటి మెట్టు అవుతుంది.

దీనివలన ఒనగూడేదేమిటో కొన్ని అంకెల ద్వారా వివరించవచ్చు. 2019లో మన దేశంలో ప్రైవేటు వ్యక్తుల వద్ద ఉన్న సంపద విలువ సుమారు రూ.945 లక్షల కోట్లు అని అంచనా వేశారు. ఇందులో అత్యంత సంపన్నులు ఒక శాతం మంది వద్ద 42.5 శాతం సంపద ఉంది. అంటే అది సుమారు రూ. 400 కోట్లు. దీని మీద కనీసం 2 శాతం సంపద పన్ను విధించినా దానివలన రూ.8 లక్షల కోట్లు వస్తుంది (ఎలిజబెత్ వారెన్ అమెరికా అధ్యక్ష పదవికి పోటీలో ఉన్న కాలంలో ఆమె 5 శాతం సంపద పన్ను విధిస్తానని తన ప్రణాళికలో ప్రకటించింది. తర్వాత బెర్నీ శాండర్స్ సంపద ఎక్కువ ఉన్నకొద్దీ పన్ను రేటు ఎక్కువ ఉండే విధంగా 1 నుండి 8 శాతం వరకూ సంపద పన్ను విధించాలని ప్రతిపాదించాడు.).

ఇక వారసత్వ పన్ను సంగతి చూద్దాం. అత్యంత సంపన్నులు ఒక్క శాతం మందిలో ప్రతీ ఏటా 5 శాతం మందికి వారసత్వంగా ఆస్తి వస్తుంది (అంటే అత్యంత సంపన్నుల్లో ప్రతీ 100 మందిలో ఏడాదికి అయిదుగురు తమ వారసులకు ఆస్తులు అప్పజెప్తున్నారు అనుకుందాం). అంటే రూ.400 లక్షల కోట్లలో 5 శాతం అవుతుంది. అది రూ.20 లక్షల కోట్లు. దానిలో మూడో వంతు వారసత్వ పన్నుగా నిర్ణయిస్తే రూ. 6.67 లక్షల కోట్ల చొప్పున ప్రతి ఏటా ప్రభుత్వానికి ఆదాయం వస్తుంది. జనాభాలో కేవలం ఒక్క శాతంగా ఉన్న అత్యంత సంపన్నులపై ఈ పన్నులు విధిస్తే ప్రభుత్వానికి ఏటా రూ.14.67 లక్షల కోట్లు వస్తాయి. ఇది మన జిడిపిలో 7 శాతం.

మన దేశం సంక్షేమ రాజ్యంగా ఉండాలంటే (1) అందరికీ అందుబాటులో ఉండే ధరల్లో చౌకగా ఆహారాన్ని పొందగలిగే హక్కు (2) అందరికీ ఉపాధి ఏడాది

పొడవునా పొందే హక్కు, (3) అందరికీ ఉచితంగా వైద్యసేవలు అందేలా ఆరోగ్య హక్కు, (4) అందరికీ ఉచితంగా యూనివర్సిటీ స్థాయి దాకా విద్య పొందే హక్కు, (5) వృద్ధాప్యంలో, అంగవైకల్యంలో జీవించడానికి అవసరమైన మోతాదులో పెన్షన్ పొందే హక్కు ఉండాలి. ఈ అయిదు హక్కులూ అమలు కావాలంటే ప్రస్తుత జిడిపిలో 10 శాతం అదనంగా వనరులు అవసరమౌతాయి. ఈ అదనపు 10 శాతాన్ని ప్రభుత్వం ఖర్చు చేయగలిగితే, అలా ఖర్చయిన మొత్తం నుండి వివిధ పన్నుల రూపంలో రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలకు కనీసం 15 శాతం అదనంగా తిరిగి వస్తుంది. ఆ 15 శాతాన్ని మినహాయించి తక్కిన 85 శాతాన్ని అదనపు పన్నుల రూపంలో వసూలు చేస్తే చాలు. పైన తెలిపిన లెక్కల ప్రకారం సంపద పన్ను, వారసత్వ పన్ను వసూలు చేస్తే వచ్చే మొత్తం అందుకు సరిపోతుంది.

అంటే, కేవలం ఒక్క శాతం జనాభాగా ఉన్న అత్యంత సంపన్నులపై రెండే రెండు రకాల పన్నులను విధిస్తే మన దేశాన్ని సంక్షేమ రాజ్యంగా మార్చవచ్చు. మనది పేద దేశమని, ప్రజలు అనుభవించే దుర్భర పరిస్థితులను మార్చడానికి కావలసిన ఆర్థిక వనరులు లేవని ఎవరైనా అంటే అది శుద్ధ తప్పు.



# సంపద వారసత్వం - బూర్జువా భావజాలం

'అంబానీకి అంత సంపద ఎందుకు ఉంది? నాకెందుకు లేదు?' అని ఒక బూర్జువా ఆర్థికవేత్తను ఓ ముఠా కార్మికుడు అడిగితే ఆర్థికవేత్త సమాధానం ఇలా ఉంటుంది. ముఠా కార్మికుడికి లేని కొన్ని 'ప్రత్యేక లక్షణాలు' అంబానీకి ఉన్నాయి. అయితే సంపదలో అసమానతలను వివరించటానికి అసలు ఈ 'ప్రత్యేక లక్షణాలు' ఏంటనే విషయం గురించి బూర్జువా ఆర్థికవేత్తలలో ఏకాభిప్రాయం లేదు.

ఒక వ్యక్తి సంపన్నుడుకావటాన్ని వివరించే 'ప్రత్యేక లక్షణాల'కు విలువ ఉండాలంటే సదరు వ్యక్తి సంపన్నుడు అయివుండాలి. ఉదాహరణకు ఒక పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థలో పెట్టుబడి పోగవుతుంది. కాలక్రమంలో దానివల్ల సంపద పెరుగుతుంది. కార్మికుల ఆదాయాలు వారి బతుకు దెరువుకు కూడా సరిపోని స్థితిలో పొదుపు చేయటానికి వారికి అవకాశం తక్కువగా ఉంటుంది. దానితో వారు తమ సంపదను పెంచుకోలేరు. అంటే వారికి ప్రారంభం లోనే ఎటువంటి సంపద సమకూరదు. కాబట్టి ముఠా కార్మికుడికి లేని సంపద అంబానీకి ఎందుకు ఉంది? అనే విషయాన్ని వివరించటానికి... అతనికి ముఠా కార్మికుడి కంటే ఎక్కువగా పొదుపు చేయటమనే 'ప్రత్యేక లక్షణం' వున్నదని చెప్పటం తప్పుడు తర్కం. ఎందుకంటే ఒకవేళ ముఠా కార్మికుడికి, అంబానీకి ఉన్నంత సంపద ఉంటే అతను అంబానీ కంటే ఎక్కువగా కాకపోయినా ఆ మాత్రం పొదుపరిగా ఉండగలిగేవాడే.

వేరే మాటల్లో చెప్పాలంటే సంపన్నులకు తమ ఆదాయాన్నంతా వ్యయం చేసే అవకాశం ఉండదు కనుక పొదుపరులుగా ఉంటారు. కాబట్టి అంబానీ మరింత పొదుపరిగా ఉండటం వల్ల అయన మరింత సంపన్నుడుగా ఉన్నాడు. ఒక ముఠా కార్మికుడి కంటే అంబానీ అనే వ్యక్తికి ఎక్కువ సంపద ఉండటాన్ని ఏ 'ప్రత్యేక లక్షణం' కూడా వివరించలేదు. క్లుప్తంగా చెప్పాలంటే ఆ 'ప్రత్యేక లక్షణం' అంబానీ సంపన్నుడనే

వాస్తవానికి సంబంధం లేకుండా ఉండి తీరాలి.

ఆ విధంగా సంపన్నులను 'సంపద సృష్టికర్తలు' అని నరేంద్ర మోడీ అనటాన్ని అర్థం చేసుకోవాలి. ఒక సామాజిక క్రమాన్ని అలా వివరించటం మూర్ఖత్వం. కాసేపు ఈ మూర్ఖత్వాన్ని పట్టించుకోకుండా వాదన కోసం ఈ వివరణను అంగీకరిద్దాం. అంబానీ లేక అదానీ వంటి వారు 'సంపద సృష్టికర్తలు' అయినప్పుడు ముఠా కార్మికుడు ఎందుకు కాలేకపోయాడనే విషయాన్ని ఇది వివరించజాలదనే విషయాన్ని ఇక్కడ గమనించాలి.

బూర్జువా ఆర్థికవేత్త జోసఫ్ షూం పీటర్ నవకల్పన (ఇన్నోవేటివ్) సామర్థ్యాన్ని 'ప్రత్యేక లక్షణం'గా పేర్కొన్నాడు. నూతన ఉత్పత్తి పద్ధతులు, నూతన ఉత్పత్తులు, నూతన మార్కెట్ల వంటి విషయాలలో నవకల్పనలు ప్రవేశ పెట్టడంగా ఇది ఉంటుంది. 'ఆవిష్కరణలు, 'నవకల్పనలు' వేరువేరని, మొదటిది నూతన ప్రక్రియల గురించి, ఉత్పత్తుల గురించి జ్ఞానం అభివృద్ధి చెందటమని, రెండవది ఆ జ్ఞానాన్ని ఆచరణలో ఉపయోగించటమని ఆయన అన్నారు. సమాజంలో 'ఆవిష్కరణలు' స్వతంత్రంగా జరుగుతుండగా, ఈ ఆవిష్కరణలను ఉత్పత్తి ప్రక్రియలో ప్రవేశ పెట్టటానికి 'ప్రత్యేక లక్షణం' కావలసి ఉంటుంది. ఒక లాభసాటి అవకాశాన్ని గుర్తించి, చేపట్టే సామర్థ్యంగా ఇది ఉంటుంది. ఎంటర్‌ప్రెన్యూర్లుగా పిలవబడే కేవలం కొద్దిమంది పారిశ్రామికవేత్తలకే ఈ 'ప్రత్యేక లక్షణం' ఉంటుంది. ఒక వ్యక్తి సంపన్నుడా, కాదా అనే విషయంపై ఈ వ్యాపార దక్షత ఆధారపడదని ఆయన అంటాడు. కానీ, సంపద సమకూరాలంటే వ్యాపార దక్షత కావాలి. ఎందుకంటే ఒక నూతన ప్రక్రియను లేక ఉత్పాదనను ప్రవేశ పెడితేనే ఇతరులను అధిగమించి ఒకరు సంపన్నులు కాగలరు. కాబట్టి 'పొదుపరి' వాదన లాగా షూం పీటర్ వాదన తర్కరహితంగా లేదు.

అస్థిత్వంలోగల వ్యాపార సంస్థలు తమ తమ ఆలోచనా ధోరణి లోనే కొనసాగటం అలవాటుగా మారు తుందని, ఈ సంస్థలు నూతన ప్రక్రియలను, ఉత్పాదన లను ప్రవేశ పెట్టటానికి సంశయిస్తాయని, అందువల్ల ఈ సంస్థలకు భిన్నంగా, బయట నుంచి పారిశ్రామికవేత్తలు వస్తారని కూడా షూం పీటర్ వాదించారు. తాము ప్రారంభించిన నూతన సంస్థలలో నవకల్పనలను ప్రవేశపెట్టి వీరు పెద్ద ఎత్తున సంపాదిస్తారు. కాబట్టి పెట్టుబడిదారీ సమాజంలో సంపద అసమానత అస్థిత్వంలో వున్నప్పటికీ కాలక్రమంలో శిఖరాగ్రాన ఉండే 5 శాతం మంది అత్యంత సంపన్నుల కూర్పు తరచూ మారుతుంటుందని ఆయన వాదించాడు.

అయితే దాని గురించి మనం ఇక్కడ చెప్పబోవటం లేదు. అంతేకాకుండా ఆధునిక పెట్టుబడిదారీ వ్యవస్థలో పరిశోధనా ప్రయోగశాలలుగల సంస్థలు వున్నప్పుడు

ఆవిష్కరణలు, నవకల్పనలు సంస్థల పరిమాణంతో సంబంధం లేకుండా ఉండవు. అంటే అటువంటి సంస్థల యజమానులు ఆవిష్కరణలు, నవకల్పనలు అప్పటికే వున్న సంపదకు ఆవల ఉండవు. దీనితో అప్పటికే సంపద వున్న వాళ్ళకే సంపద సమకూరుతుందని తేలినందున కొందరు ధనికులుగాను, మిగిలిన వారందరూ పేదలుగా ఎందుకు మిగిలిపోయారో వివరించేందుకు షూం పీటర్ సిద్ధాంతం పనికిరాదని తేలిపోయింది. అయితే ఈ సమస్యలన్నింటినీ పట్టించుకోకుండా షూం పీటర్ చెప్పినట్టు సంపన్నులు సంపన్నులు కావటానికి వారికి వున్న 'నవకల్పన' లేక ఆయన చెప్పిన 'వ్యాపారదక్షత' అనే 'ప్రత్యేక లక్షణం' ఉందనుకుందాం.

కానీ, ఈ వాస్తవం సంపన్నుల సంతానం కూడా సంపన్నులుగా ఎందుకు ఉండాలి అనే ప్రశ్నను వివరించదు. సమర్థించదు. అలా సంపదను పొందటానికి ఈ సంతానం ఎటువంటి 'ప్రత్యేక లక్షణాన్ని' ప్రదర్శించలేదు. కాబట్టి వారికి సంపద వుండటానికిగల కారణం తల్లిదండ్రుల నుంచి వారసత్వంగా సంపద సంక్రమించడమనే సామాజిక ఏర్పాటు ఉండటమే. ఈ సమాజిక ఏర్పాటుకు ఎటువంటి ఆర్థిక హేతుబద్ధత లేదు.

ఈ విషయాన్ని మళ్ళీ షూం పీటర్ వివరణనే తీసుకుని విశదీకరిద్దాం. ఒకవేళ సంపదను వారసత్వంగా సంతానానికి సంక్రమించటాన్ని అడ్డుకుంటే 'నవకల్పనల'ను ప్రవేశ పెట్టటానికి 'పారిశ్రామికవేత్తల'కు ప్రోత్సాహకం ఉండదు. పెట్టుబడిదారీ వ్యవస్థలో 'ప్రగతి' కోసం చెల్లించే వెలగా వారసత్వ చట్టాలు ఉంటా యంటాడు షూం పీటర్. అయితే షూంపీటర్ లేక అలాంటి ఏ ఇతర సిద్ధాంతంలో కూడా 'నవకల్పనా సామర్థ్యాన్ని' వివరించటంలో 'ప్రోత్సాహకాల'కు ఎటువంటి పాత్రా లేదు. ఒకవేళ ఒక నూతన ప్రక్రియ అందుబాటు లోకి వస్తే దాన్ని కేవలం ఒకే సంస్థ తన ఉత్పత్తి వ్యవస్థలోకి ప్రవేశ పెట్టదు. దాన్ని మరో సంస్థ ప్రవేశ పెట్టి మొదటి సంస్థను పోటీ నుంచి వైదొలగేలా చేస్తుంది. కాబట్టి నవకల్పనలు ప్రవేశ పెట్టటానికి ప్రేరేపణ పోటీ లోనే తప్ప ప్రోత్సాహకాలలో లేదు. వేరే మాటల్లో చెప్పాలంటే ఈ బూర్జువా సిద్ధాంతాలన్నింటి ప్రకారం ఒకవేళ 'పారిశ్రామికవేత్తల'కు చెందిన యావత్ సంపదనూ వారి మరణానంతరం పన్ను రూపంలో తీసుకున్నప్పటికీ నవకల్పనలను ప్రవేశ పెట్టే వేగం ఏమాత్రం తగ్గదు.

ఒకవేళ ఒక ఆవిష్కరణ ఒకే సంస్థ గుత్త నియంత్రణలో వుంటే తమ సంపదను తమ పిల్లలకు, వారి పిల్లల పిల్లలకు సంక్రమింపజేసే ప్రోత్సాహకాలు లేనట్టయితే దానిని ఉత్పత్తి వ్యవస్థలో ప్రవేశ పెట్టటం జరగదనేది నిజం. కానీ, అప్పుడు సంపదకు వివరణ 'నవకల్పనా సామర్థ్యం' నుంచి గుత్తాధిపత్యానికి బదిలీ అవుతుంది. ఒకవేళ

గుత్తాధిపత్యమే సంపదకు వివరణ అయితే అది బూర్జువా సిద్ధాంతాన్ని అనుసరించినా సమర్థనీయం కాదు (అందుకే గుత్తాధిపత్య నిరోధక చట్టాలు, గుత్తాధిపత్య కూటమి నిరోధక చర్యలు ఉంటాయి). నిజానికి ఒకవేళ సంపదకు కారణం గుత్తాధిపత్యం అని అంగీకరిస్తే బూర్జువా సిద్ధాంతం మార్క్సిస్టు అర్థశాస్త్ర ప్రమాణతను అంగీకరించవలసి ఉంటుంది. పెట్టుబడిదారీ వ్యవస్థలో పెట్టుబడిదారులు ఒక వర్గంగా ఉత్పత్తి సాధనాలపై గుత్తాధిపత్యాన్ని చెలాయిస్తూ దోపిడీ చేసిన మిగులు విలువలోనే సంపద మూలాలున్నాయని మార్క్సిస్టు అర్థశాస్త్రం చెబుతోంది.

'పరిశోధన, ఉత్పత్తి వ్యవస్థలు పెద్దవైతేనే కుదురుతుంది కాబట్టి గుత్త సంస్థలు ఏర్పడతాయి. కాబట్టి వాటి అస్థిత్వం గురించి విచారించనవసరం లేదు. నేటి ప్రపంచంలో 'ప్రగతి' కోసం వాటి అవసరం ఉంటుంది. సంపదలో శాశ్వత అసమానతలను ఇది వివరిస్తుంది. సమర్థిస్తుంది' అని కొందరు బూర్జువా ఆర్థికవేత్త లంటారు. అయితే ఈ వాదన తప్పు. ఎందుకంటే పెద్ద పరిమాణంలో ఉత్పత్తి ఉండటం వల్ల ప్రైవేటు సంపదలో అసమానతలు తీవ్ర స్థాయిలో ఉండనవసరం లేదు. యాజమాన్యాన్ని వికేంద్రీకరించిగానీ లేక యాజమాన్యాన్ని ప్రభుత్వ ఆధీనంలో వుంచిగానీ పెద్ద ఎత్తున ఉత్పత్తి కార్యకలాపాలను సాగించవచ్చు.

కాబట్టి సంపద వారసత్వాన్ని బూర్జువా సిద్ధాంతం కూడా సమర్థించజాలదని దీనినిబట్టి అర్థం అవుతోంది. బూర్జువా సిద్ధాంతాన్ని అనుసరించి కూడా ఈ సామాజిక ఏర్పాటుకు ఆర్థిక హేతువు లేదు. మనం షూం పీటర్ సిద్ధాంతాన్ని మాత్రమే పరిశీలించాం. అయితే ఇదే విషయం సంపద అసమానతల గురించి చేసిన ఇతర వివరణలకు కూడా వర్తిస్తుందని చెప్పవచ్చు. అదేమంటే సమాజంలో సంపద అసమానతలను తార్కికంగా వివరించే ఏ బూర్జువా సిద్ధాంతమూ సంపద వారసత్వ నియమాన్ని సమర్థించజాలదు.

వారసత్వ నియమాన్ని బూర్జువా సిద్ధాంతం సమర్థించలేని స్థితిలో పెట్టుబడిదారులు ఈ నియమం ఉండాలని, కొనసాగాలనీ కోరతారు. అయితే ఒక ప్రజాస్వామిక సమాజాన్ని నిర్మించదలచినప్పుడు సంపదలో అసమానతలు నియంత్రణలో ఉండాలి. బూర్జువా సిద్ధాంతం ప్రకారం కూడా వారసత్వ పన్నును గణనీయ పరిమాణంలో విధించి పెట్టుబడిదారులను నిలువరించాల్సి ఉంటుంది. మన లాంటి సమాజాలలో అసలు వారసత్వ ఆస్తిపై పన్ను అనేదే లేకపోవటం ప్రభుత్వాల పని తీరు ఎలా వుందో తెలియజేస్తోంది.



# నయా ఉదారవాదంలో అభివృద్ధి వెల్లివిరుస్తుందా..?

ఆర్థిక కార్యకలాపాల స్థాయి పెట్టుబడిదారీ వ్యవస్థలో నెలకొనే ఆటుపోట్లతో ప్రభావితం అవుతుంది. ఆర్థిక వ్యవస్థ ఉవ్వెత్తున ఎగసిపడుతున్నప్పుడు పెట్టుబడిదారులకు విపరీతమైన బలం వస్తుంది. ఆ ప్రభావంతో 'మంచి రోజులు' అలానే కొనసాగుతాయని ఆశిస్తారు. దానితో వారు రిస్క్ తీసుకోవటానికి జంకరు. వారు సాహసోపేతంగా వ్యవహరిస్తారు. ఆస్తుల విషయంలో 'ధైర్యం'గా నిర్ణయాలు తీసుకుంటారు. దీనితో నిర్మాణాలు, యంత్రాల వంటి స్థిర ఆస్తులపై పెట్టుబడులు పెడతారు. దాంతో ఆర్థిక వ్యవస్థ విజృంభిస్తుంది.

ఆర్థిక వ్యవస్థ వెనకపట్టు పట్టినప్పుడు సరిగ్గా దీనికి విరుద్ధంగా జరుగుతంది. దీనితో పెట్టుబదారులతో నైరాశ్యం ఏర్పడుతుంది. రిస్క్ తీసుకోవటానికి వారు భయపడతారు. ఆస్తులను ఏర్పరుచుకోటానికి భయపడి పెట్టుబడి పెట్టడానికి వెనుకంజ వేస్తారు. ఆదాయం రాకపోయినా సంపద నగదు రూపంలో ఉంచుకోవటానికి ఇష్టపడతారు. ఇటువంటి పరిస్థితి మాంద్యాన్ని కనసాగేలా చేస్తుంది. ఆ విధంగా రిస్క్ తీసుకోవటానికి భపడపడటం సమంజసమే అనే భావన కలుగజేస్తుంది.

ఆర్థిక వ్యవస్థ విజృంభిస్తున్నప్పుడు ఉల్లాసంగా ఉండడం, మాంధ్యం నెలకొన్నప్పుడు నైరాస్యలో పడడం పెట్టుబడిదారీ వ్యవస్థకున్న లక్షణం. మూడో ప్రపంచ దేశాలలో జరిగే అభివృద్ధి విస్తరణ దీని ప్రభావం పడుతుంది.

అభివృద్ధి చెందిన సామ్రాజ్యవాద దేశాల కంటే మూడో ప్రపంచ దేశాలలో పెట్టుబడి పెట్టడం మరింత రిస్క్‌తో కూడకున్న విషయమనీ పెట్టుబడిదారులు భావిస్తారు. సామ్రాజ్యవాద పెట్టుబడిదారీ దేశాలు పెట్టుబడిదారీ వ్యవస్థకు పుట్టినిల్లు వంటివి. చర్మం రంగు తెలుపైనా, నలుపైనా అన్ని రకాల పెట్టుబడిదారుల తాము

పుట్టి పెరిగిన దేశాలలో కంటే కూడా ఈ దేశాలను సురక్షితమైనవిగా భావిస్తారు. అందుకే మూడో ప్రపంచ దేశాలకు చెందిన పెట్టుబడిదారులు సామ్రాజ్యవాద దేశాలకు నిధులను పెద్దఎత్తున తరలిస్తుంటారు. అయితే ఉల్లాస స్థితికి కారణమైన ఆర్థికాభివృద్ధి విజృంభించినప్పుడు మూడో ప్రపంచ దేశాలలో ఆస్తులను కలిగి ఉండటంలో గల రిస్క్‌ను తక్కువగా అంచాన వేయటం జరగుతుంది. అర్థికాభివృద్ధి విజృంభణ కారణంగా ఏర్పడిన ఉల్లాస స్థితి... ఆస్తులను ఎంచుకునే క్షేత్రంలోకి విస్తరింస్తుంది. అటువంటి పరిస్థితిలో సాధారణంగా పెద్దఎత్తున పెట్టుబడులు పెడతారు. ఆదాయంలేని, రిస్క్‌లేని ఆస్తిగా ఉన్ననగదును పెట్టుబడిగా పెట్టడం జరుగుతుంది. అలాంటి స్థితిలో మూడో ప్రపంచ దేశాల ఆస్తులకు కూడా విపరీతమైన డిమాండ్ ఏర్పడుతుంది. మూడో ప్రపంచ దేశాల కంటే సామ్రాజ్యవాద దేశాలకు ఇచ్చే ప్రాధాన్యతలోగల వ్యత్యాసం తగ్గుతుంది. దీనితో మూడో ప్రపంచ దేశాలకు ప్రత్యక్ష పెట్టుబడులు రావటమే కాకుండా ఈ దేశాలలోని ఆస్తులను కొనటానికి మరింతగా ఫైనాన్స్ కూడా వస్తుంది. సామ్రాజ్యవాద దేశాలలోని ఆస్తుల విలువలతో పోల్చినప్పుడు మూడో ప్రపంచ దేశాల ఆస్తుల విలువ సాపేక్షంగా పెరుగుతుంది. దాంతో అటువంటి ఆస్తుల ఉత్పత్తి పెరుగుతుంది. అంటే పెట్టుబడులు పెరుగుతాయి. కాబట్టి దీనితో మూడో ప్రపంచ దేశాలలో వృద్ధి రేటు పెరుగుతుంది.

ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో మాంద్యం నెలకొన్నప్పుడు సరిగ్గా దీనికి విరుద్ధంగా జరుగుతుంది. అటువంటి పరిస్థితులలో పెట్టుబడిదారులు రిస్క్ తీసుకోవటానికి వెనకాడతారు. మూడో ప్రపంచ దేశాలకు ప్రత్యక్ష పెట్టుబడుల ప్రవాహాలు అడుగంటుతాయి. ట్రంప్ అవలంభిస్తున్నటువంటి రక్షిత విధానాలను సామ్రాజ్యవాద దేశాలు అవలంభిస్తే పరిస్థితి మరింతగా దిగజారుతుంది. అంతేకాదు మూడో ప్రపంచ దేశాలకు ద్రవ్యపెట్టబడి రావటం ఆగిపోతుంది. నిజానికి సామ్రాజ్యవాద దేశాలకేగాక మూడో ప్రపంచ దేశాలకు చెందిన ఫైనాన్స్‌కు కూడా సామ్రాజ్యవాద దేశాలకు తరలే ధోరణి ఉంటుంది. మూడో ప్రపంచ దేశాలలోని ఆస్తుల ధరలు సామ్రాజ్యవాద దేశాలతో పోల్చినప్పుడు సాపేక్షంగా పడిపోతాయి. ఇది స్థానిక పెట్టుబడులను మరింతగా కుంగదీసి మూడో ప్రపంచ దేశాల వృద్ధి రేటు పతనం కావటానికి కారణమౌతుంది.

ఈ పరిస్థితికి రెండు అంతస్సూచికలున్నాయి. 'నాయా ఉదారవాద శకంలోని ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థలో ఆర్థికాభివృద్ధి విజృంభించినప్పుడు (బామ్ కాలం) మూడో ప్రపంచ దేశాలలో వృద్ధి రేట్లు ఉన్నత స్థాయిలో నమోదవుతాయి. ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థ మాంద్యం నెలకొన్నప్పుడు ఈ దేశాలలోని వృద్ధిరేట్లపై పూర్తిగా

వ్యతిరేకత ప్రభావం ఉంటుందన్నది నిస్సందేహం' అనేది మొదటి అంతస్సూచిక. 'పెట్టుబడులు పెట్టటానికి, రిస్క్ తీసుకునేందుకు వెనకాడటం వల్ల ఏర్పడే ప్రభావం సామ్రాజ్యవాద దేశాలపై కంటే మూడో ప్రపంచ దేశాల మీద ఎక్కువగా ఉంటుంది. సామ్రాజ్యవాద దేశాలలోని ఆస్తుల విలువలో కంటే మూడో ప్రపంచ దేశాలలోని ఆస్తుల విలువలో సాపేక్షంగా అస్థిరత ఎక్కువగా ఉంటుంది. అందువల్ల మూడో ప్రపంచ దేశాలలోని వృద్ధి రేట్లలో సంభవించే ఆస్థిరత సామ్రాజ్యవాద దేశాల వృద్ధి రేట్లలో సంభవించే ఆస్థిరత కంటే ఎక్కువగా ఉంటుంది' అనేది రెండో అంతస్సూచిక.

అంటే ఏ మేథావులైతే నయా ఉదారవాదం ప్రవేశానికి ముందు కంటే తరువాత కాలంలో మూడో ప్రపంచ దేశాలలో అధిక వృద్ధి రేటు నమోదు కావటం నయా ఉదారవాదంతో జరిగిన ప్రయోజనానికి సాక్ష్యం అని హర్షం వ్యక్తపరిచారో వారే ఇప్పుడు ఆ మాటలను విస్మరిస్తున్నారు. ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థలో మాద్యం కొనసాగటమే కాకుండా తీవ్రమవుతుండగా, ఫైనాన్స్ ప్రవాహాలు వేగవంతంగా సామ్రాజ్యవాద దేశాలవైపు తరలటం ఇప్పటికే మొదలవగా సామ్రాజ్యవాద దేశాలలో కంటే మూడో ప్రపంచ దేశాలలో పెట్టుబడి, వృద్ధి రేటు మరింతగా ఆవిరైపోతాయి.

కనుచూపు మేరలో పెట్టుబడిదారీ వ్యవస్థలో నెలకొన్న మాంద్యానికి ముగింపు లేకపోవడం, ట్రంప్ రక్షిత విధానాలను అవలంబించటం వంటి కారణాల వల్ల ప్రపంచ సంక్షోభం తీవ్రమతుంది. దానితో భవిష్యత్తు నిరాశాజనకంగా మారుతుంది. ఇతర దేశాల నుంచి ప్రతిఘటన ఎదురయ్యేదాకా మాత్రమే వాటిని నష్టపరిచైనా బాగుపడాలనే విధానంతో అమెరికా తాత్కాలికంగా లాభపడవచ్చు. ఈ మాంద్యంతో మూడో ప్రపంచ దేశాలలో ఏర్పడే నిస్పృహ సుదీర్ఘ కాలంపాటు కొనసాగుతుంది. క్లుప్తంగా చెప్పాలంటే మూడో ప్రపంచం సుదీర్ఘ కాలంపాటు కొనసాగే మాంద్యంలో కూరుకుపోతున్నది. దీనితో కష్టజీవుల జీవితాలు దుర్భరమవుతాయి. ఎందుకంటే ఒకవైపు మాంద్యం పెట్టుబడిదారీ క్షేత్రంలో ఉద్యోగ కల్పనను పరిమితం చేస్తుంటే మరోవైపు బామ్ కాలంలో పెట్టుబడి ప్రాథమికంగా పోగుబడుతూ రైతాంగాన్ని, చిన్న ఉత్పత్తిదారులను పీల్చి పిప్పి చేస్తున్నది.

క్లుప్తంగా చెప్పాలంటే మూడో ప్రపంచ దేశాలలో అభివృద్ధి వెల్లివిరుస్తుందనే అతిశయోక్తులకు అచిర కాలంలోనే కాలం చెల్లుతుంది. పరిస్థితులు ఇలా తారుమారు కావటం ఇదే తొలిసారి కాదు. 19వ శతాబ్దం చివరన, 20వ శతాబ్దం ఆరంభంలో సంభవించిన విక్టోరియన్, ఎడ్వర్డియన్ బామ్‌ల కాలంలో కూడా మూడో ప్రపంచంలో అభివృద్ధి చెందుతున్న దేశాలలో భాగమైన మూడో ప్రపంచ దేశాలను నేడు 'బాగా వెనుకబడిన దేశాలు'గా భావించబడుతున్నాయి. ఇందుకు మయన్మార్ ఒక చక్కని

ఉదాహరణ. నిజానికీ నాయా ఉదారవాద శకంలో పెట్టుబడిదారీ బూమ్ దశలో మూడో ప్రపంచ దేశాలలో అభివృద్ధి వెల్లివిరుస్తుందని అప్పటి కంటే ఇప్పుడు మరింత బలంగా వాదించారు. చమురు వనరులు ఆవిరైపోగానే దాని భవిష్యత్ అంధకార బంధమైంది. అయితే 'నిన్నటి విజేతలు రేపు వెనుక పడటం' అనే నానుడి అసహజమైదేమీ కాదు.

విక్టోరియన్, ఎడ్వర్డియన్ బూమ్‌ల పతనాంతరం 1930లో దశకంలో మహా మాంద్యం సంభవించింది. మహా మాంద్య కాలంలో ప్రపంచ పెట్టుబడిదారీ విశృంఖల సాలెగూటి నుంచి వాణిజ్య, పెట్టుబడుల ప్రవాహాలపు నియంత్రణలు విధించటం ద్వారా బయటపడిన మూడో ప్రపంచ దేశాల అభివృద్ధి చెందాయి. మహా మాంద్యం కాలంలో లాటిన్ అమెరికా దేశాలు సామ్రాజ్యవాదంతో కుమ్మక్కైన స్థానిక దళారులను కూలదోసి ప్రత్యామ్నాయ దిగుమతుల పారిశ్రామీకరణ అనే 'జాతీయవాద వ్యూహం'తో ముందుకెళ్లి అభివృద్ధి చెందాయి. అందుకే భిన్నంగా భరతదేశం వంటి వలస పాలకులు స్థానిక బూర్జువా వర్గాన్ని సంతృప్తిపరచటం కోసం 'వివక్షతో కూడిన రక్షణ'ను అందిచినప్పటికీ అది ఎందుకూ కొరగాలేదు.

ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థలో నెలకొన్ని సంక్షోభం కారణంగాను, పైన వివరించినట్టుగా దాని ప్రభావం మూడో ప్రపంచ దేశాలపై మరింత తీవ్రంగా ఉండటం చేతనూ మనం ప్రాధన్యతగల రాజకీయ తిరుగుబాట్లు, ఆర్థిక మార్పులు జరగబోయే కాలంలో ప్రవేశించబోతున్నాం. అయితే సందేహంలేని విషయం ఒకటుంది. ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థ కక్ష్యలోనే వుంటూ మూడో ప్రపంచ ఆర్థిక నిస్పృహను అధిగమించగలదనే భావన సృష్టింబడింది. నాయా ఉదారవాదంతో సామ్రాజ్యవాద దేశాల నుంచి మూడో ప్రపంచంలోకి అభివృద్ధి వెల్లివిరుస్తుందనే వాదనకు కాలం చెల్లింది.



# పెట్టుబడిదారీ వ్యవస్థ: తృతీయ ప్రపంచ అభివృద్ధి

నేడు మనం అనుకుంటున్న మూడవ ప్రపంచం ఎప్పుడూ ఒకేలా లేదు. అంతర్జాతీయ పెట్టుబడిదారీ వ్యవస్థ చొరబాటుతో తృతీయ ప్రపంచం ఒక ప్రత్యేకమైన నిర్మాణాత్మక మార్పుకు గురయింది. ఉదాహరణకు భారతదేశంలో పారిశ్రామిక విస్తరణ కొడిగట్టడం, నిధులను విపరీతంగా తరలించడంతో వ్యవసాయంపై ఒత్తిడి పెరిగింది. దాంతో ఆధునిక సామూహిక దారిద్ర్యం ఉద్భవించింది. పెట్టుబడిదారీ ప్రపంచ ఆర్థిక వ్యవస్థలోకి మూడవ ప్రపంచాన్ని విలీనం చేసిన తీరు కారణంగా 'వెనుకబాటుతనం' ఏర్పడింది. వలస పాలన నుంచి విముక్తి పొందుతున్న కాలంలో అటువంటి విలీనం నుంచి బయటపడవేసే ఒక ప్రత్యామ్నాయ వ్యవస్థతోనే ప్రజలు ప్రగతిని సాధించగలరే భావన ఉండేది. అలా బయట పడటాన్ని అంతర్జాతీయ పెట్టుబడి సహించదు. కాబట్టి చారిత్రక యవనికపై ఆలస్యంగా ఏతెంచిన మూడవ ప్రపంచ దేశాలలోని బూర్జువా వర్గం అంతర్జాతీయ పెట్టుబడిని ఎదుర్కొలేదు. అది జరగాలంటే కార్మిక – రైతాంగ మైత్రి ఆధారంగా ఏర్పడే రాజ్యంతోనే సాధ్యం. అప్పట్లో ఈ వామపక్ష వాదనకు మేధోపరమైన పలుకుబడి గణనీయంగా ఉండేది. కాల గమనంలో ఈ దేశాలు అంతర్జాతీయ పెట్టుబడిదారీ వ్యవస్థ నుంచి విడివడి దశల వారీగా సోషలిజం వైపు పయనిస్తున్నాయనే భావన ఉండేది. కాబట్టి మూడవ ప్రపంచ దేశాల అభివృద్ధి పెట్టుబడిదారీ మార్గంలో జరగదని భావించారు. సోషలిజం నమూనాలో నడిచినప్పుడు అది సాధ్యపడుతుందని భావించారు. అయితే అటువంటి అవగాహనకు నయా ఉదారవాద శకంలో సవాలు ఎదురయింది. గతంలో ప్రపంచ ఆర్థిక వ్యవస్థను వివిధ భాగాలుగా విడగొట్టిన కారకాలు ఇక ఏమాత్రం పని చేయటం లేదనే వాదన రూపంలో ఈ సవాలు ఉంది. అభివృద్ధి చెందిన దేశాల పెట్టుబడులు

వెనుకబడిన దేశాలకు, వెనుకబడిన దేశాల శ్రామికులు అభివృద్ధి చెందిన దేశాలకు పయనించే స్వేచ్ఛ లేకపోవటంతో ప్రపంచం అభివృద్ధి చెందిన దేశాలుగాను, వెనుకబడిన దేశాలుగాను విభజింపబడింది. అయితే పేద దేశాల మార్కెట్లను కైవసం చేసుకోవటానికి, ఈ దేశాలను ముడి సరుకుల వనరులుగా మార్చేందుకు మాత్రమే అభివృద్ధి చెందిన దేశాలు పోటీ పడ్డాయి. పేద దేశాలలో వేతనాలు తక్కువగా ఉన్నప్పటికీ సామ్రాజ్యవాద దేశాలతో పాటు ప్రపంచ మార్కెట్ అవసరాల కోసం ఈ దేశాలలో పరిశ్రమల స్థాపన జరగలేదు.

ఈ కొత్త వాదన ప్రకారం నయా ఉదారవాద ప్రపంచీకరణలో ఈ పరిస్థితి మారింది. ప్రపంచలో గల డిమాండ్‌ను సంతృప్తి పరిచేందుకుగాను సామ్రాజ్యవాద ప్రపంచ పెట్టుబడి... తక్కువ వేతనాలుగల మూడవ ప్రపంచ దేశాలలో పరిశ్రమలను స్థాపించటానికి సిద్ధంగా ఉంది. నిజానికి అనేక సేవారంగ కార్యకలాపాలను, పరిశ్రమలను మూడవ ప్రపంచ దేశాలకు ముఖ్యంగా తూర్పు, ఆగ్నేయ, దక్షిణాసియా దేశాలకు బదిలీ అవటాన్ని చూస్తే ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థ చట్రంలో కూడా ఈ దేశాలలో ఆర్థికాభివృద్ధి వేగంగా జరుగుతుందనిపిస్తుంది. ఈ వాదన పూర్తిగా లోపభూయిష్టమైనది. ఏ నయా ఉదారవాద వ్యవస్థలోనైతే సామ్రాజ్యవాద పెట్టుబడిదారీ దేశాల నుంచి మూడవ ప్రపంచ దేశాలకు అలాంటి కార్యకలాపాలు విస్తరిస్తున్నాయో... అదే వ్యవస్థ మూడవ ప్రపంచ దేశాలలోని చిన్న ఉత్పత్తిపై క్రూరమైన దాడి చేస్తూ... పెట్టుబడి ప్రాథమికంగా పోగుబడే ప్రక్రియను ఆ దేశాలపై రుద్దుతుంది. అదే సమయంలో మూడవ ప్రపంచ దేశాలలో స్థూల జాతీయోత్పత్తి గణనీయంగా గతంలో ఎన్నడూలేని స్థాయిలో పెరుగుతున్న స్థితిలో కూడా ఉద్యోగితను పెంచదు. అంతటి స్థాయిలో వృద్ధి రేటు పెరిగినప్పటికీ పేదరికం నుంచి ఉపశమనం లభించకపోగా వాస్తవంలో అది తీవ్రతరమైంది. అయితే ప్రస్తుతం ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థ ఒక నూతన దశలోకి ప్రవేశించింది. ఈ దశలో నయా ఉదారవాద వ్యవస్థలో విస్తృతమైన ఆర్థిక కార్యకలాపాలకు పరిమితులు ఏర్పడుతున్నాయి. కాబట్టి వాణిజ్యం, పెట్టుబడులపై నియంత్రణలు లేని ప్రపంచ పెట్టుబడిదారీ చట్రంలో మూడవ ప్రపంచ దేశాలు అభివృద్ధి చెందుతున్నాయనే భావన ఆధారంగా చేసిన వాదన ప్రాసంగికతను కోల్పోయింది. సామ్రాజ్యవాద పెట్టుబడిదారీ దేశాల నుంచి ఆర్థిక కార్యకలాపాలు మూడవ ప్రపంచ దేశాలకు విస్తరించకుండా పరిమితులును విధించటమే లక్ష్యంగా ట్రంప్ తీసుకుంటున్న రక్షిత చర్యలు ఉన్నాయి. అంటే నయా ఉదారవాదం ప్రస్తుతం దిక్కుతోచని స్థితికి చేరుకుందనే వాస్తవం దీనితో మనకు అర్థం అవుతోంది.

ట్రంప్ నయా ఉదారవాదాన్ని వదిలించు కోవటం లేదనే విషయాన్ని మనం గమనించాలి. అంతేకాకుండా ఆయన నయా ఉదారవాద వ్యవస్థలో కేంద్రకమైన ఫైనాన్స్ రూపంలోని పెట్టుబడికిగల ప్రపంచవ్యాప్త చలనాన్ని భద్రంగా చూసుకుంటున్నాడు. అయితే అమెరికాలో ఉత్పన్నమయ్యే డిమాండ్‌ని సంతృప్తి పరచటానికి అమెరికా, ఇతర సామ్రాజ్యవాద, మూడవ ప్రపంచ పెట్టుబడులతో మూడవ ప్రపంచ దేశాలలో పరిశ్రమలు స్థాపించటంపై పరిమితులను విధిస్తున్నాడు. అటువంటి పరిమితుల వల్ల అమెరికా పెట్టుబడిదారుల నష్టపోతే కార్పొరేట్ లాభాలపై పెద్ద ఎత్తున పన్ను రాయితీలు ఇవ్వటం ద్వారా వారికి ఆయన పరిహారం చెల్లిస్తాడు. అమెరికా పెట్టుబడి నష్టపోకుండా ఉండే విధంగా ట్రంప్ చర్యలు వుంటున్నాయి. అయితే దానితో తమ దేశాలకు పెట్టుబడిదారీ దేశాల ఆర్థిక కార్యకలాపాలు విస్తరించటం ద్వారా ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థ చట్రంలో కూడా మూడవ ప్రపంచ దేశాలు అభివృద్ధిని సాధించవచ్చుననే భావనకు కాలం చెల్లుతుంది.

నయా ఉదారవాద ప్రపంచీకరణ కాలంలో ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థను ఒక పెను సంక్షోభం ఆవహించిన పరిస్థితులలో ట్రంప్ తీసుకుంటున్న చర్యలను అర్థం చేసుకోవాలి. సామ్రాజ్యవాద పెట్టుబడిదారీ దేశాల నుంచి ఆర్థిక కార్యకలాపాలు మూడవ ప్రపంచ దేశాలకు బదిలీ అయినప్పుడు బదిలీ చేసిన దేశాలలోని కార్మికుల నిజవేతనాలు పెరగలేదనే వాస్తవంలో ఈ సంక్షోభ మూలాలు ఉన్నాయి. అలాగే అదే సమయంలో మూడవ ప్రపంచ దేశాలలో కూడా కార్మికుల నిజవేతనాలు పెరగలేదు. వలస పాలన కాలంలో ఈ దేశాలో పెద్దఎత్తున సృష్టించబడిన నిరుద్యోగ సైన్యం పరిమాణం తగ్గకపోగా పెరగటమే దీనికి కారణం. ఆ విధంగా ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో నిజ వేతనాల రేఖ దాదాపు నిలకడగా ఉండగా, శ్రామిక ఉత్పాదకత మిగులు వాటా ఊహీతీతంగా పెరిగింది. అటువంటి మిగులు నుంచి వినిమయంపై చేసే వ్యయం... వేతనాల నుంచి వినియమంపై చేసే వ్యయం కంటే తక్కువగా ఉ ండటంతో ఏర్పడిన ఈ పరిస్థితి ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో అధికోత్పత్తి దిశగా పయనించే ధోరణిని సృష్టించింది. అయితే ఈ ధోరణి అమెరికా ఆర్థిక వ్యవస్థలో ఏర్పడిన రెండు 'బుడగ'లతో నియంత్రించబడింది. వీటిలో మొదటిది 1990వ దశకంలో 'డాట్ కాం బుడగ' గాను, రెండవది ఈ శతాబ్దారంభంలో 'గృహ వ్యాపార బుడగ'గాను ఏర్పడ్డాయి.

'గృహ వ్యాపార బుడగ' పతనం తరువాత దాని స్థానంలో మరో కొత్త 'బుడగ' ఏర్పడటం లేదు. అమెరికా ఆర్థిక వ్యవస్థ, దానితోపాటుగా ప్రపంచ పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థ ఒక సంక్షోభ కాలంలోకి ప్రవేశించాయి. దీనితో ప్రజలలో అసంతృప్తి

తీవ్ర స్థాయిలో పెరిగి వ్యవస్థకు అవసరమైన సామాజిక సుస్థిరతకు ప్రమాదం ఏర్పడింది. స్తంభనతో సతమతమౌతున్న కార్మిక వర్గం వర్తమానంలో పెరిగిన నిరుద్యోగిత భారాన్ని కూడా మోయవలసి వస్తుంది.

ఇతర దేశాలను ముఖ్యంగా మూడవ ప్రపంచ దేశాలను నష్టపెట్టయినా తమ దేశాన్ని సంక్షోభం నుంచి గట్టెక్కించాలనే లక్ష్యంగా ట్రంప్ తన విధానాలను రూపొందిస్తున్నాడు. అంటే అమెరికాలో ఉద్యోగితను పెంచటానికి వేరే దేశాల్లో ముఖ్యంగా మూడవ ప్రపంచ దేశాలలోని ఉద్యోగాలను కైవలసం చేసుకునేలా ట్రంప్ తన విధానాలను రూపొందిస్తున్నాడు. ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో ఏర్పడిన మాంద్యం కొనసాగుతూనే ఉన్నది. అయితే మాంద్యం కొనసాగుతున్న ఈ ప్రపంచ ఆర్థిక వ్యవస్థలోనే అమెరికా ఇతరులను నష్టపరచి తన పరిస్థితిని మెరుగు పరుచుకునే ప్రయత్నం చేస్తున్నది. దీనితో ఇతర దేశాలు ప్రతీకారం తీర్చుకునేదాకా కొంతకాలంపాటు అమెరికా పరిస్థితి మెరుగువ్వవచ్చేమోగానీ ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థలో నెలకొన్న సంక్షోభం సమసిపోదు. అంతేకాకుండా ఇతర దేశాలు ప్రతీకరం తీర్చుకున్నప్పుడు ఈ సంక్షోభం మరింతగా తీవ్రతరమౌతుంది. అంటే నయా ఉ దారవాద పెట్టుబడిదారీ వ్యవస్థ దిక్కుతోచని స్థితికి చేరుకుందని దీనిని బట్టి మనకు అర్థమవుతోంది.

ఇటువంటి పరిస్థితిలో అభివృద్ధి చెందిన దేశాల నుంచి ఆర్థిక కార్యకలాపాలు వ్యాప్తి చెందు తాయని ఆవపడటం, ఆ విధంగా ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థ చట్రం పరిధిలో వేగంగా వృద్ధిని కొనసాగించగలమని అనుకోవటం దురాశే అవుతుంది. మనం చూసిన వృద్ధితో పాటుగా అందవలసిన ఉపశమనం అందకపోగా ప్రజల సామూహిక దారిద్ర్యం మరింతగా తీవ్రతరమైంది. అయితే ప్రస్తుతం ఈ అభివృద్ధి సదిశ కూడా అంతిమ దశకు చేరుకుంది.

మూడవ ప్రపంచ దేశాలు ఇప్పటినుంచి వృద్ధిని సాధించాలంటే దేశీయ మార్కెట్‌ను అభివృద్ధి చేసుకునే చర్యలను చేపట్టవలసి ఉంటుంది. ఎందుకంటే ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో మాంద్యం కొనసాగటం, అమెరికా రక్షిత విధానాలను అవలంభిచటం వల్ల ఈ దేశాలు అభివృద్ధి కావాలంటే తమ దేశీయ మార్కెట్‌పైనే ఆధారపడాలి. ఇది జరగాలంటే రైతాంగం చేస్తున్న వ్యవసాయం వృద్ధి చెందాలి. దేశీయంగా ఆర్థిక అసమానతలు తగ్గాలి. దేశవ్యాప్తంగా నిజవేతనాలు పెరగాలి. కనీస వేతనం పెరగాలి. ప్రభుత్వ వ్యయం పెరగటమే కాకుండా క్రియాశీలయవ్వాలి. ఈ చర్యలన్నీ ప్రపంచ ద్రవ్య పెట్టుబడికి నచ్చవు. అందుకు ప్రతిగా ద్రవ్య పెట్టుబడిదారీ వర్గం తమ పెట్టుబడులను ఉపసంహరించి ఆర్థిక సంక్షోభం ఏర్పడేలా చేస్తుంది. అటువంటి

పరిస్థితిని నివారించటానికి పెట్టుబడులపై నియంత్రణలను విధించవలసి ఉంటుంది. దీనితో విదేశీ మారక ద్రవ్య చెల్లింపుల శేషంకు చెందిన కరెంటు ఖాతాలోటును పూడ్చటం కష్టతరమయ్యే అవకాశం ఉంటుంది. గనుక దిగుమతులపై కూడా నియంత్రణలను విధించవలసి ఉంటుంది.

అయినప్పటికినీ ఈ చర్యలన్నీ అమలు కావాలంటే రాజ్య స్వభావంలో మార్పు రావాలి. అంటే రాజ్యానికి పునాదిగా ఉన్న వర్గ స్వభావంలో మార్పు రావాలి. నయా ఉదారవాద పెట్టుబడిదారీ వ్యవస్థ దిక్కుతోచని స్థితికి చేరిన ప్రస్తుత పరిస్థితులలో మూడవ ప్రపంచ దేశాలు మాంద్యాన్ని సంక్షోభాన్ని అధిగమించటమనేది కార్మిక - రైతాంగ మైత్రి ఆధారంగా ఏర్పడిన రాజ్యంతో మాత్రమే సాధ్యపడుతుంది. అటువంటి మైత్రి ఆధారంగా ఏర్పడిన రాజ్యం చొరవతో మొదలయ్యే అభివృద్ధి వివిధ దశల్లో సోషలిజం వైపు పయనిస్తుంది. మూడవ ప్రపంచ దేశాలలో అభివృద్ధి సోషలిజం వైపు నడిపించే మార్గం ద్వారా మాత్రమే సాధ్యమనే పాత వాదన ఈ నూతన పరిస్థితులలో మరింత ప్రాసంగితను పునఃసముపార్జించుకుంది.



# సొంత గూటికే అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడి

ఇతర దేశాలను తమ వలసలుగా మార్చి వాటిపై పెత్తనం సాగించిన కాలంలో... పెట్టుబడి ఎక్కడ పెట్టాలనే విషయాన్ని నిర్ణయించాల్సి వస్తే పెట్టుబడిదారులు జాతి వివక్షత, ఇతర తేడాలు పాటించేవారని, ప్రస్తుతం ప్రపంచీకరణ శకంలో ఆ పరిస్థితి లేదని ప్రపంచీకరణ సమర్థకులు చెప్పుకుంటారు. ఇప్పుడు అటువంటి వివక్షతలు లేకుండా ఎక్కడ లాభాలు వస్తే అక్కడికల్లా పెట్టుబడి ప్రవహిస్తుందని వారంటారు. సంపన్న దేశాలలో వేతనాల స్థాయి ఎక్కువగాను, మూడో ప్రపంచ దేశాలలో వేతనాల స్థాయి తక్కువగాను ఉంటుంది గనుక మూడో ప్రపంచ దేశాలలో పరిశ్రమలు స్థాపిస్తేనే వారికి లాభాలు ఎక్కువగా వస్తాయి. అందుచేత ప్రపంచీకరణలో మూడో ప్రపంచ దేశాలలోకి పెట్టుబడులు ఎక్కువగా వస్తాయి. దీని పర్యవసానంగా సంపన్న దేశాలకు, మూడో ప్రపంచ దేశాలకు మధ్య అంతకు ముందు కాలంలో పెరిగిపోయిన అంతరాలు ప్రపంచీకరణ క్రమంలో తగ్గిపోతాయని ప్రపంచీకరణను సమర్థించేవారు వాదిస్తారు.

ఈ వాదనను ముందుకు తెచ్చి మూడో ప్రపంచ దేశాలు విదేశీ పెట్టుబడులకు తలుపులు బార్లా తెరవడం ప్రయోజనకరం అని వారు చెప్తారు. ఆ విధంగా ఇంతకు ముందే చేసిన తూర్పు, ఆగ్నేయ ఆసియా దేశాలకు సంపన్న దేశాల నుండి సేవారంగం, కొన్ని పరిశ్రమలు తరలివచ్చిన వైనాన్ని కూడా వారు ఉదాహరణగా చూపిస్తారు. ఆ విధంగా 'తలుపులు బార్లా తెరవడం' నష్టదాయకమని వాదించడమంటే ఆ వాదన పాత చింతకాయ పచ్చడి లాంటిదేనని, సామ్రాజ్యవాదులపై స్వతంత్రం కోసం జరిపిన పోరాటాల వాసన అని, దాన్ని వదలగొట్టుకోవాలని వారంటారు. వలస విధానమే అంతరించిపోయి మూడో ప్రపంచ దేశాల నుండి కూడా ఆర్థిక దిగ్గజాలు బయలుదేరి

సూపర్ పవర్స్ అయిపోతూంటే ఇంకా 'సామ్రాజ్యవాదం' అన్న పదం పట్టుకుని వేలాడటంలో అర్థం ఏముందని వారు ప్రశ్నిస్తారు.

ప్రపంచ మార్కెట్‌లో పోటీలో నిలదొక్కుకోవాలంటే ఏ దేశమైనా నిరంతరం సాంకేతికంగా, వ్యవస్థీకృతంగా అభివృద్ధి చెందుతూ పోవలసిందేనన్నది వారి వాదన లోని మొదటి అంశం. దీనిని ఇప్పుడు వివరంగా చర్చించబోవడం లేదు, కాని క్లుప్తంగా చెప్పాలంటే సాంకేతికాభివృద్ధి, వ్యవస్థీకృత సర్దుబాట్లు ఉత్పాదకత రేటును పెంచడానికి తోడ్పడతాయి.

అదేసమయంలో ఉపాధి కల్పన రేటును తగ్గిస్తాయి. దానితోబాటు వ్యవసాయ రంగంలో రైతుల ఆదాయాలు కుదించుకుపోతాయి. అందువలన గ్రామాల నుండి పట్టణాలకు వలసలు పెరుగుతాయి. సంపన్న దేశాల నుండి ఇక్కడికి పెట్టుబడులు వచ్చినా ఇక్కడి నిరుద్యోగం పెరుగుతూనే పోతుంది. పేదరికమూ పెరుగుతుంది. జిడిపి వృద్ధిరేటు పెరిగినా ఈ నిరుద్యోగం, పేదరికం పెరుగుతాయే తప్ప తగ్గవు. దానివలన దేశంలో సామాజికంగా, ఆర్థికంగా అంతరాలు బాగా పెరిగిపోతాయి. మన దేశపు అనుభవం ఇదే.

మరికాస్త వివరంగా చర్చించేది రెండో అంశం: ఈ తలుపులు బార్లా తెరిచేటప్పుడు మన దేశం లోకి వస్తున్నది ద్రవ్యపెట్టుబడా లేక పారిశ్రామిక పెట్టుబడా అన్న తేడా చూడడం లేదు. పారిశ్రామిక పెట్టుబడి ఏదేశంలో ప్రవేశించాలి అన్న విషయాన్ని పెద్దగా పట్టించుకోదని, కేవలం లాభం ఎక్కడ వస్తుందో వాసన చూసి పట్టేసి అక్కడికి పోతుందని కొందరు అంటారు. ఇది వాస్తవం కాదు. అయితే ఫైనాన్సు పెట్టుబడి అలాంటిది కాదు. దీని స్వభావం కళ్లకు కట్టినట్టు ఇప్పుడు ఈ కరోనా మహమ్మారి కాలంలో కనపడుతోంది.

ఫైనాన్సు పెట్టుబడికి మూడు ముఖ్యమైన లక్షణాలు ఉన్నాయి. మొదటిది అతివేగంగా సంచలించడం. ఏ చిన్నపాటి అసౌకర్యం అనిపించినా, ఏ చిన్న పరిణామం సంభవించినా వెనువెంటనే మెరుపువేగంతో ఒక చోటి నుండి ఇంకొక చోటికి అది తరలిపోతుంది. ఈ తరలిపోవడం ఒక రంగంలో మొదలైతే అది అంతటికీ విస్తరించి ఆ దేశపు ఆర్థిక వ్యవస్థనే అస్థిరపరుస్తుంది.

ఇక రెండో లక్షణం: ద్రవ్య పెట్టుబడి స్పష్టమైన ఒక విధమైన పిడివాదంతో ఉంటుంది. రాజ్యం (ప్రభుత్వం) ఆర్థిక వ్యవస్థ నియంత్రణకు పూనుకోవడం ద్రవ్య పెట్టుబడికి సుతరామూ ఇష్టం లేదు. ఆ దేశపు ద్రవ్యలోటు ఏ పరిస్థితుల్లోనూ అనుమతించిన దానికన్నా కొద్దిపాటి పెరిగినా దానిని ద్రవ్య పెట్టుబడి సహించదు. అందువల్లే చాలా ప్రభుత్వాలు ప్రభుత్వ రంగ సంస్థలో పెట్టుబడులు పెంచడానికిగాని,

విద్య, వైద్యం వంటి రంగాల కేటాయింపులను పెంచడానికి కాని సాహసించవు. ఇంత ఆర్థిక మాంద్యం ఉన్నా ద్రవ్యలోటు పెరగకుండా స్థిరంగానే ఉండడం వెనక కారణం ఇదే.

ఇక మూడవ లక్షణం : దీని గురించి పెద్దగా చర్చ జరగడం లేదు. దీనిని పెద్దగా ఎవరూ పరిగణన లోకి తీసుకోవడమూ లేదు. కాని ఇది అత్యంత ప్రాముఖ్యత ఉన్న లక్షణం. ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో ఏ చిన్నపాటి అలజడి వచ్చినా సంపన్న దేశాలలో తాను భద్రంగా ఉండే స్థావరాలకు ద్రవ్య పెట్టుబడి తరలిపోతుంది. ఆ మూడో ప్రపంచ దేశం నుండి తనకు ఏ ఇబ్బందీ రాకపోయినా ఆర్థిక వ్యవస్థలో వచ్చిన అలజడికే, ఆ మూడో ప్రపంచ దేశానికీ ఏమీ ప్రత్యక్ష సంబంధం లేకపోయినా, ద్రవ్య పెట్టుబడి మాత్రం తన స్థావరానికే పారిపోతుంది. కరోనా మహమ్మారి వచ్చాక ఒక్క మార్చి నెలలోనే మూడో ప్రపంచ దేశాల నుండి (భారత్ సహా) 83 బిలియన్ డాలర్ల పెట్టుబడి సంపన్న దేశాలకు తరలిపోయింది! (రూ.6 లక్షల 25 వేల కోట్లు) అంటే ఏమిటి? ఫైనాన్సు పెట్టుబడి గుడ్డిగా ప్రతి చోటికీ ప్రవేశించదు. లాభాల వేటలో మూడో ప్రపంచ దేశాలలో సంచరించవచ్చు కాని ఏ సమస్య వచ్చినా వెంటనే సొంత గూటికి చేరిపోతుంది. తానున్న చోట ఆ సమస్య తలెత్తకపోయినా సరే ప్రపంచంలో వేరే ఏ చోట అయినా సమస్య తలెత్తితే చాలు. పెట్టుబడి తన సొంత గూటికి పారిపోతుంది. దీని ఫలితంగా ఆ మూడో ప్రపంచ దేశాల కరెన్సీల విలువలు డాలరు మార్కెట్ విలువతో పోల్చితే పడిపోతాయి (మన దేశం నుండి డాలర్లు బైటకు పోతే, డాలరుకు డిమాండ్ పెరిగి దాని విలువ పెరుగుతుంది. దానితో పోల్చితే రూపాయి విలువ తగ్గుతుంది). దీనివలన విదేశీ రుణాల చెల్లింపులు చేయలేని పరిస్థితి వస్తుంది. అప్పుడు విదేశీ మారక నిల్వలు తిరిగిపోయి లోటు పెరుగుతుంది. దానిని భర్తీ చేయాలంటే మళ్లీ విదేశీ అప్పులు తేవాల్సిందే. ఈ అప్పులతో బాటు షరతులు, పొదుపు చర్యలు మామూలే. దానివలన మరింతగా నిరుద్యోగం పెరుగుతుంది.

ప్రపంచ ఆర్థిక వ్యవస్థ అంతా ఫైనాన్సు పెట్టుబడికి ఏ ఇబ్బంది లేకుండా నడుస్తున్నప్పుడు మూడో ప్రపంచ దేశాలలో ప్రభుత్వాలను ప్రజా సంక్షేమ ఖర్చు చేయనివ్వకుండా అడ్డం పడుతుంది. ఇక ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో ఏ చిన్నపాటి అలజడి సంభవించినా ఆ మూడో ప్రపంచ దేశాలు పొదుపు చర్యలు చేపట్టి సంక్షేమ పద్దులు తగ్గించుకునే పరిస్థితిని కల్పిస్తుంది.

ప్రపంచీకరణ అంటేనే మూడో ప్రపంచ దేశాలపై అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడి పెత్తనం చేయడం. అంతేగాక ఈ ద్రవ్య పెట్టుబడి సంపన్న దేశాలతో పోల్చితే మూడో

ప్రపంచ దేశాల పట్ల ఎప్పుడూ చిన్నచూపునే ప్రదర్శిస్తుంది. ప్రపంచీకరణ కాలంలో జాతీయ రాజ్యాలన్నీ అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడికి లంగి ప్రజాస్వామ్యాన్ని అంతకంతకూ కుదించి వేస్తున్నాయి. ఈ సంగతిని అందరూ గుర్తిస్తున్నారు. కాని సంపన్న దేశాలతో పోల్చితే మూడో ప్రపంచ దేశాల పరిస్థితి మరీ అన్యాయంగా ఉంటోందన్న వాస్తవాన్ని అందరూ గమనించడం లేదు.

ఈ తేడా ప్రస్తుతం కరోనా మహమ్మారి కాలంలోనూ ప్రస్ఫుటంగా కనపడుతోంది. ఈ మహమ్మారి తీవ్రతను తట్టుకోవడానికి అన్ని సంపన్న దేశాలూ ఆర్థిక ప్యాకేజీలు ప్రకటించాయి. తమ తమ జిడిపిల్లో గణనీయమైన శాతాన్నే సహాయంగా ప్రకటించాయి. జర్మనీ 5 శాతం, అమెరికా 15 శాతం (ఇప్పటికి) జపాన్ 20 శాతం... ఇలా ఈ ప్యాకేజీలు అమలైతే ఆ దేశాలు ద్రవ్యలోటు భారీగా పెరుగుతుందన్న సంగతిని వారు పట్టించుకోవడం లేదు. ద్రవ్యలోటు పెరగడమే కాక, ప్రభుత్వాలు తమ కేంద్ర బ్యాంకుల నుంచి అప్పులు కూడా తీసుకుని ప్యాకేజీలు అమలు చేస్తున్నాయి (ఈ ప్యాకేజీల ప్రయోజనాలు ఏయే వర్గాలకు ఎంతెంత చెందుతాయి అన్నది వేరే విషయం). అదే మన దేశంలో నిర్మలా సీతారామన్ ప్రకటించిన రూ. 1.7 లక్షల కోట్ల ప్యాకేజీ మన జిడిపిలో 0.7 శాతం మాత్రమే. అందులోనూ బడ్జెట్‌లో కేటాయించిన దాన్నే చాలా వరకు 'ప్యాకేజీ' అని ప్రకటించారు. లాక్‌డౌన్ అలా పొడిగిస్తూ పోతున్నా, ప్యాకేజీ మాత్రం అదనంగా ఏమీ రాలేదు. తాను ద్రవ్యలోటు పరిమితిని దాటబోనని తాజాగా ఇప్పుడు మన ప్రభుత్వం స్పష్టంగా తేల్చి చెప్పేసింది. ఇది మోడీ ప్రభుత్వం ద్రవ్య పెట్టుబడి ముందు ఎంతగా దాసోహమంటూ దిగజారుతున్నదో సూచిస్తోంది. అదే సమయంలో దాని నిస్సహాయతనూ చూపిస్తోంది.

ఇక వామపక్షంలో కూడా ఒక ధోరణి కొన్నిచోట్ల వ్యక్తమవుతోంది. కమ్యూనిస్టులు కోరుకునే అంతర్జాతీయతలో కొంత వరకూ ప్రపంచీకరణ సాధించినట్టేనని వారంటున్నారు. ఈ అంతర్జాతీయత కార్మిక వర్గం వైపు నుండి గాక ద్రవ్య పెట్టుబడి వైపు నుంచి పెట్టుబడిదారీ వ్యవస్థ చట్టం లోనే ఏర్పడుతోందని అంటున్నారు. అందువలన 'మనం ఇప్పుడు ప్రపంచీకరణకు పూర్వం ఉన్న పరిస్థితులకు పోవడం కన్నా ప్రపంచీకరణ చట్టం లోపలే ఉంటూ ద్రవ్య పెట్టుబడి ఆధిపత్యాన్ని కూలదోద్దాం' అని వారు ప్రతిపాదిస్తున్నారు. ఈ వాదన రెండు విధాలుగా తప్పు.

**మొదటిది :** ప్రస్తుతం అంతర్జాతీయ స్థాయిలో కార్మిక పోరాటాల మధ్య సమన్వయం ఏదీ లేదు. ఇక రైతుల పోరాటాల అంతర్జాతీయ సమన్వయం గురించి చెప్పనక్కరలేదు. ప్రపంచీకరణను అంతర్జాతీయంగా ఓడించాలంటే దానిని ఓడించే

వర్గాలు అంతర్జాతీయ స్థాయిలో తమ పోరాటాలను సమన్వయం చేసుకోవడం తప్పనిసరి.

**రెండవది :** సంపన్న దేశాల నుండి పెట్టుబడి కార్యకలాపాలు మూడో ప్రపంచ దేశాలకు కొంత తరలి వచ్చినా, అంతర్జాతీయంగా పెట్టుబడిదారీ విధానం వివిధ దేశాల మధ్య, వివిధ ప్రాంతాల మధ్య పెంచిన అంతరాలు, అలానే కొనసాగుతున్నాయి. అందువలన ద్రవ్య పెట్టుబడి ఆధిపత్యం నుండి అంతర్జాతీయంగా విముక్తి పొందాలనే పోరాటం అన్ని దేశాలలోనూ ఒక తీరుగా, ఒకే స్థాయిలో ఉండదు. ఇప్పుడు తమ దేశాల నుండి ద్రవ్య పెట్టుబడి అమాంతరం తరలిపోకుండా నిరోధించాలంటే మూడో ప్రపంచ దేశాలు ఆ ద్రవ్య పెట్టుబడి తమ దేశాలను వీడిపోకుండా దాని కదలికలపై ఆంక్షలు విధించాలి. అంటే దాని అర్థం ప్రపంచీకరణ క్రమంతో విడగొట్టుకోవడమే కదా. కాబట్టి మూడో ప్రపంచ దేశాలలో కార్మికులు, రైతులు ప్రపంచీకరణ క్రమంతో విడగొట్టుకుని బైటపడాలని తమ ప్రభుత్వాలపై ఒత్తిడి పెంచే పోరాటాలు చేయడం ప్రధాన లక్ష్యంగా పెట్టుకోవాలి.

దీనర్థం ద్రవ్య పెట్టుబడి తన ఆదేశాలను అమలు చేయడానికి సాధనాలుగా ఉపయోగించే (ఐఎంఎఫ్, ప్రపంచ బ్యాంకు, డబ్ల్యూటీవో వగైరా) వ్యవస్థలను, వాటి ఆచరణను మార్చాలనే పోరాటం వదలి పెట్టమని కాదు. ఈ సంస్థల వత్తిడితో ఇంతవరకూ అమలు చేసిన సంస్కరణల వలన మూడో ప్రపంచ దేశాలకు ఒరిగిందేమీ లేదు. అందుచేత వాటిని సంస్కరించేందుకు జరిగిన పోరాటం కన్నా, ప్రపంచీకరణ చట్టం నుంచి బద్దలుగొట్టుకుని బైటపడడమే ఈ దేశాలకు ఎక్కువ ఉపయోగం. ఈ పని జరిగితేనే మొత్తం ప్రపంచీకరణ క్రమాన్ని ప్రపంచం అంతటా ఓడించే ప్రక్రియ వేగవంతం కాగలదు. దీనిని పక్కనబెట్టి ప్రపంచీకరణను అమలు జరిపే సంస్థలను సంస్కరించడమంటే అది విజయవంతం కాజాలదు. ఎందుకంటే ద్రవ్య పెట్టుబడి తన ఆధిపత్యాన్ని తానే స్వచ్ఛందంగా ఎన్నటికీ వదులుకోదు.



# మితవాదం వైపు మళ్ళిన ప్రపంచం!

మనం చర్చల్లో ఈ విషయాన్ని తరచూ పట్టించుకోం. అయితే ఎన్నికల్లో మోడీ రెండవసారి విజయం సాధించటం మితవాదం వైపు మళ్లిన ప్రపంచంలో భాగమే. ఇజ్రాయిల్‌లో నెతన్యాహు తిరిగి ఎన్నికయ్యారు. టర్కీలో ఎర్డోగాన్ పెద్దఎత్తున గెలిచారు. అన్ని ఊహాగానాలకు భిన్నంగా ఆస్ట్రేలియాలో మితవాద ప్రభుత్వం అధికారంలోకి వచ్చింది. ఈ మధ్యకాలం వరకు లాటిన్ అమెరికాలో అనేక దేశాలలో అధికారం లోకి వచ్చిన వామపక్షాలు మిగిలిన ప్రపంచంలో కూడా ఆశలు రేకెత్తించాయి. కానీ ఆ తరువాత లాటిన్ అమెరికాలో దేశం తరువాత దేశంలో మితవాద ప్రభుత్వాలు ఏర్పడ్డాయి. వీటిలో అత్యంత ప్రాధాన్యతగల దేశం బ్రెజిల్. ఈ దేశ నూతన అధ్యక్షుడు జైర్ బోల్సోనారో గతంలో పాలన సాగించిన సైనిక ప్రభుత్వ నియంతృత్వాన్ని సమర్థించటమే కాకుండా మరికొంత మందిని కూడా చంపి ఉండాల్సిందని అన్నాడు! వీటన్నింటి కంటే మించి యూరోపియన్ యూనియన్‌కు జరిగిన ఎన్నికల్లో కూడా మితవాదం వైపు మొగ్గు స్పష్టంగా కనిపించింది.

ఈ ఎన్నికల్లో ఫ్రాన్స్‌లో మరైన్ లీ పెన్ నాయకత్వం లోని తీవ్ర మితవాద పార్టీ, ఫ్రెంచ్ అధ్యక్షుడైన ఎమ్మాన్యుయల్ మాక్రాన్ నాయకత్వం లోని మధ్యేవాద కూటమిని అధిగమించి అతి పెద్ద పార్టీగా అవతరించనుంది. ఇటలీ ఉప ప్రధాని నాయకత్వం లోని తీవ్ర మితవాద పార్టీ ఆ దేశంలో అతి పెద్ద పార్టీగా అవతరించటమే కాకుండా జర్మనీకి చెందిన ఏంజెలా మెర్కెల్ పార్టీని అధిగమించి యూరోపియన్ పార్లమెంట్‌లో అన్ని పార్టీల కంటే పెద్ద పార్టీగా అవతరించే అవకాశం ఉంది. ఐదేళ్ల క్రితంతో పోలిస్తే మెర్కెల్ పార్టీ 9 శాతం ఓట్లను కోల్పోయింది. జర్మనీలో కూడా 'ఆల్టర్‌నేటివ్ ఫర్ జర్మనీ' అనే తీవ్ర మితవాద పార్టీ తన ఓట్లను 10.5 శాతానికి పెంచుకుంది. హంగేరీలో విక్టర్ ఓర్‌నవ్ నాయకత్వంలోని పార్టీ ఎన్నికల్లో విజయం సాధించబోతోంది.

దేశంలోని పరిస్థితుల కారణంగా మోడీ గెలిచాడనేది సుస్పష్టం. అయితే ప్రపంచం పూర్తి స్థాయిలో మితవాదం వైపు మళ్ళిన సందర్భాన్ని మనం విస్మరించకూడదు. యావత్ ప్రపంచం ఇంత కలిసికట్టుగా మితవాదం వైపు మళ్ళటం జరిగినప్పుడు ఇలా ఎందుకు జరిగిందనే ప్రశ్న మనం అడగాలి. ఇటువంటి అనేక పార్టీల, ఉద్యమాల మధ్య సామ్యాన్ని చూడకుండా ఉదార బూర్జువా విశ్లేషకులు వాస్తవ దృశ్యాన్ని విడగొట్టి చూస్తున్నారు. యూరోపియన్ పార్టీలను యూరోపియన్ యూనియన్‌కు అనుకూల, వ్యతిరేక పార్టీలుగాను లేక వలసలకు అనుకూల, వ్యతిరేక పార్టీలుగాను విభజిస్తున్నారు. అలాగే మోడీ విజయాన్ని భారతదేశానికే ప్రత్యేకమైన హిందూత్వ కారణమని, ఐరోపాలో జరుగుతున్న దానికి సంబంధం లేదని వాదిస్తున్నారు. డోనాల్డ్ ట్రంప్ గెలవటానికి అవకాశాలు మెరుగుపడటాన్ని కూడా ఈ విషయాలతో సంబంధం లేనట్టుగా చూస్తున్నారు. అయితే అలా విడివిడిగా ముక్కలు చేసి చూడటం మార్క్సిస్టు విశ్లేషణకు సరిపడదు. ఉమ్మడి సారూప్యతలు, ఆవిర్భవిస్తున్న వర్గ రూపాలను మార్క్సిస్టు విశ్లేషణ పట్టించుకుంటుంది. యావత్ ప్రపంచం ఇలా మితవాదం వైపు మొగ్గటాన్ని మార్క్సిస్టులుగా మనం ఎలా విశ్లేషిస్తాం?

2008 నుంచి ప్రపంచ ఆర్థిక వ్యవస్థను ఆవహించిన ఆర్థిక సంక్షోభ వ్యక్తీకరణే ఇది అనేది సుస్పష్టం. అప్పుడప్పుడు సంక్షోభం నుంచి బయట పడుతున్నట్టు అనిపించినా ప్రపంచ ఆర్థిక వ్యవస్థ తిరిగి మరింతగా సంక్షోభంలో కూరుకు పోతున్నది. ప్రపంచ ఆర్థిక వ్యవస్థ తీరు నేలపై ఎగిసిపడే బంతిని పోలి వుంది. బంతి పైకి లేవగానే సంక్షోభం నుంచి బయటపడుతున్నాం అనే అరుపులు, కేకలు, బంతి నేలకు తాకి చలన రహితమై పోగానే అంతా నిశ్శబ్దం. అమెరికాలో అనేక దశాబ్దాలుగా కొనసాగిన నిరుద్యోగం రేటు ప్రస్తుతం తక్కువగా ఉన్నదనే కారణం వల్ల ఈ వాదనను అంగీకరించకపోవచ్చు. అయితే 2008తో పోల్చినప్పుడు పనిలో పాల్గొనే రేటు కూడా తగ్గింది. ఒకవేళ మనం నేటి పనిలో పాల్గొనే రేటు, 2008 సంవత్సర ఆరంభంలో వున్న స్థాయిలో ఉందని అనుకుంటే అమెరికాలో నేడున్న నిరుద్యోగం రేటు అధికారికంగా ప్రకటించిన 4 శాతం కాకుండా 8 శాతంగా ఉంటుంది.

ఈ సంక్షోభం, నిరుద్యోగం నేపథ్యంలో యావత్ ప్రపంచం మితవాదం వైపు మొగ్గింది. సంక్షోభం, దాని పర్యవసానంగా ఏర్పడిన నిరుద్యోగాన్ని సాధారణంగా ఉదార బూర్జువా పార్టీలు తిరస్కరిస్తాయి. వ్యవస్థను కాకుండా వలసగా వచ్చిన వారు కారణమని, వలసలను నియంత్రించాలని చెప్పినప్పటికీ నిరుద్యోగంతో ఏర్పడే నిస్పృహను మితవాదులు కనీసం గుర్తిస్తారు. యూరోపియన్ యూనియన్‌లో కార్మికులు స్వేచ్ఛగా సభ్య దేశాలలో పని చేసుకునే వీలున్నందున మితవాదులలో

చాలామంది యూరోపియన్ యూనియన్‌కి వ్యతిరేకులయ్యారు. ఆర్థిక సంక్షోభం అస్తిత్వాన్ని కూడా ఉదార బూర్జువా పార్టీలు గుర్తించటానికి సిద్ధపడడం లేదు. దీంతో మితవాదం చొరవ తీసుకుని తన వలస వ్యతిరేక ఎజెండాతో ప్రజల ముందుకు వచ్చింది. ఆ విధంగా పాలక రాజకీయ పార్టీలు గుర్తించని సంక్షోభాన్ని, నిరుద్యోగాన్ని గుర్తించటం వల్ల మితవాదం ప్రపంచ వ్యాప్తంగా విస్తృతమైంది.

అయితే భారతదేశంలో జరుగుతున్నది దీనిలో ఎక్కడ పొసుగుతుంది? అనే ప్రశ్న ఉదయిస్తుంది. భారతదేశంలో కూడా మోడీ 2014లో 'అభివృద్ధి' ఎజెండాతోనే అధికారంలోకి వచ్చారు. యుపిఎ-2 కాలంలో వృద్ధి రేటు మందగించటంతో అందరి జీవితాలు మెరుగుపడతాయని నయా ఉదారవాదం చేసిన వాగ్దానం భంగపడిందనేది వాస్తవం. అధికారంలో వున్న మోడీ ప్రభుత్వం తాను వాగ్దానం చేసిన 'అభివృద్ధి' లేక 'వికాస్' కోసం చేసిందేమీ లేదు. అందుకే నిన్న జరిగిన ఎన్నికల్లో ఆ విషయం గురించి ఒక్క మాట కూడా మాట్లాడలేదు. అయితే ప్రవచనాన్ని 'టెర్రరిజంపై పోరాటం', 'జాతీయ భద్రతను పటిష్టం చేయటం', 'పాకిస్తాన్‌కు గుణపాఠం చెప్పటం', 'హిందూత్వను విస్తృతం చేయటం' వంటి విషయాల పైకి మరల్చి అధికారంలో ఉండగా చేసిన 'అభివృద్ధి'కి సంబంధించిన ఇబ్బందికర ప్రశ్నలు ఎదురవ్వకుండా తప్పించుకోగలిగారు. ఇది మోడీకి బాగా ఉపయోగపడింది.

అధికారం కాంగ్రెస్ వంటి నయా ఉదారవాద పార్టీ నుంచి బిజెపి వంటి మితవాద పార్టీకి మారటానికి కారణం నయా ఉదారవాదంలో నెలకొన్న సంక్షోభమే అనే విషయం మారదు. నయా ఉదారవాదంతో 'అభివృద్ధి' జరుగుతుందని కాంగ్రెస్ ఇక ఏమాత్రం చెప్పజాలదు. ఆరంభ కాలం తరువాత 'అభివృద్ధి' గురించి ఏమాత్రం మాట్లాడకుండా బిజెపి చర్చను పూర్తిగా మార్చిపడేసింది. ఇది కార్పొరేట్-ఫైనాన్షియల్ వర్గాన్ని బాగా సంతృప్తి పరచింది. (ఎంతగా నంటే బిజెపి విజయం తథ్యమని తెలియగానే సెన్సెక్స్ ఊహాతీతంగా పెరిగే వరకు).

అయితే ప్రవచనంలో ఈ మార్పు ప్రభావం తాత్కాలికంగానే ఉంటుంది. నయా ఉదారవాదంలో నెలకొన్న సంక్షోభాన్ని పరిష్కరించటం ఎలాగో, కోట్లాది నిరుద్యోగులకు ఉద్యోగాలను సృష్టించే మార్గం ఏంటో కాంగ్రెస్ పార్టీకి గానీ, బిజెపికి గానీ తెలియదు. నిజానికి గతకాలపు నయా ఉదారవాద మార్గంలో సాగటంలోగల ఇబ్బంది కాంగ్రెస్‌లో ఒక వర్గానికి అర్థం అయింది. అందుకే ఆ పార్టీ ఎన్నికల ప్రణాళికలో 'న్యాయ్' పథకాన్ని ప్రవేశపెట్టింది. ఈ పథకం నిరుపేదలకు నగదు బదిలీకి సంబంధించినది. అయితే మామూలు పరిస్థితులలో ఈ పథకం ప్రజలను బాగా ఉత్సాహపరచి కాంగ్రెస్‌కు ఊహాతీతమైన లాభాలను తెచ్చిపెట్టగలిగేదే. కానీ

అలా చేయటంలో ఈ పథకం విఫలమైంది. ఈ పథకాన్ని ఆచరణలోకి తేవటానికి కావలసిన వనరులను సమీకరించటానికి నమ్మదగిన అంచనాలను కాంగ్రెస్ అందించలేకపోవటమే దీనికి కారణం. అందుకే ప్రజలు ఈ పథకాన్ని కేవలం ఎన్నికలవ్వగానే మర్చిపోయే ఎన్నికల వాగ్దానంగా భావించారు.

మధ్యేవాద, ఉదార, బూర్జువా కాంగ్రెస్ పార్టీకి ఆర్థిక వ్యవస్థను ఎలా ముందుకు తీసుకుపోవాలో తెలియదు. అలాగే బిజెపి కూడా అదే స్థాయిలో దిక్కుతోచని స్థితిలో ఉంది. దాని 'జాతీయవాద' బ్రాండ్ విలువ త్వరలోనే పలుచ బడుతుంది. ఆకలి, దారిద్ర్యం, నిరుద్యోగ సమస్యలను ఎదుర్కొంటున్న ప్రజలను నిత్యం పాకిస్తాన్ వ్యతిరేక, ముస్లిం వ్యతిరేక వాగాడంబరంతో సంతృప్తి పరచటం సాధ్యపడదు. అంతేకాకుండా ఆర్థిక స్థితి ఎప్పుడూ ఒకేలా ఉండదు. మోడీ ప్రభుత్వం ఆర్థిక క్షేత్రంలో ఏమీ చేయనప్పటికీ ఆర్థిక వ్యవస్థ మోడీని వదలదు. సంక్షోభం మరింతగా తీవ్రతరం అవుతుంది. మాంద్యం, విదేశీ మారకద్రవ్య చెల్లింపుల శేషంలో ఏర్పడే లోటును పూడ్చటానికి కావలసిన వనరుల సమీకరణ సంక్లిష్టం కావటం వంటి సమస్యలు అనతికాలంలో మరింత తీవ్రరూపం దాలుస్తాయి. అలా జరిగినప్పుడు మోడీ ప్రభుత్వం దగ్గర పరిష్కారాలు ఏమీ ఉండవు (అప్పటికల్లా ఆర్థిక వ్యవస్థను ఆదుకోవటం మరింత కష్టం అవుతుంది). నిత్యం ప్రజలు ఎదుర్కొంటున్న భౌతిక సమస్యలకు పరిష్కారాలను ఈ రెండింటిలో ఏ నయా ఉదారవాద రాజకీయ శక్తీ అందించలేదు. కేవలం వామపక్షం మాత్రమే నయా ఉదారవాద పెట్టుబడిదారీ వ్యవస్థకు ఆవల సంక్షోభానికి పరిష్కారం చూపగలదు. అయితే ఈ పరిష్కారం అంతిమంగా మనల్ని పెట్టుబడిదారీ వ్యవస్థ పరిధిని దాటేలా చేయగలదు. ఇది భారతదేశానికే కాకుండా మిగిలిన ప్రపంచానికి కూడా వర్తిస్తుంది.

క్లుప్తంగా చెప్పాలంటే విద్వేషాలను రెచ్చగొట్టే ఒక కుహనా ఎజెండాతో తాత్కాలికంగా మితవాదం ఎంతటి విజయాన్ని సాధించినా ఈ వర్తమాన చారిత్రక సంధి కాలంలో ప్రజలు ఎదుర్కొంటున్న నిరుద్యోగాన్ని, నిస్పృహను రూపుమాపలేదు. అస్తిత్వంలో గల వ్యవస్థ స్థిరంగా ఉన్నట్టు, దానికి సుదీర్ఘ కాలం మనగలిగే సామర్థ్యం ఉన్నట్టు కనపడినా ఇదంతా ఒక్కసారే మారిపోయి గతంలో మాదిరిగా వ్యవస్థ ముందుకు సాగలేని నూతన పరిస్థితి ఏర్పడటం దేశాల చరిత్రలో మనకు కనపడుతుంది. పెట్టుబడిదారీ వ్యవస్థకు సంబంధించి భారతదేశం లోనే కాకుండా యావత్ ప్రపంచంలో కూడా ప్రస్తుతం ఇటువంటి పరిస్థితే ఉంది. మితవాదం ఇక్కడా, ఇతర చోట్లా ఎన్నికల పరంగా ఎంతటి విజయాలను సాధించినా ఈ మౌలిక వాస్తవాన్ని మార్చలేదు.



# నయా-ఉదారవాదంలో 'అభివృద్ధి', ప్రత్యామ్నాయం

ప్రస్తుత నయా ఉదారవాద యుగంలో పెట్టుబడిదారీ వ్యవస్థ సమర్థకులు వెనుకబడిన మూడో ప్రపంచ దేశాలలో అభివృద్ధి గురించి చేసే వాదనలు ఇలా ఉంటాయి.

1. సాంప్రదాయ పద్ధతులలో జరుగుతున్న ఉత్పత్తి ప్రక్రియలో ఉత్పత్తి చిన్న మోతాదులో జరుగుతుంది. పైగా పని చేసేవారి సంఖ్య మరీ ఎక్కువగా ఉంది. వీరి ఉత్పాదక స్థాయి తక్కువగా ఉంది. అందువల్ల పేదరికం కొనసాగుతోంది.

అదే ఆధునిక పెట్టుబడిదారీ పద్ధతిలోనైతే ఉత్పాదరక బాగా ఎక్కువగా ఉంటుంది. కనుక అభివృద్ధి జరగాలంటే సాంప్రాదాయ, చిన్నతరహా ఉత్పత్తి పద్ధతి నుంచి ఆధునిక పద్ధతిలోకి మారాలి.

2. ఈ మార్పు జరగాలంటే ఆధునిక పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం వేగంగా పెరగాలి. అందుకుగల అడ్డంకులు అన్నింటినీ తొలగించి పెట్టుబడి పోగుబడడానికి మనం దోహదపడాలి.

3. ఈ క్రమంలో కొంతమంది చిన్న ఉత్పత్తిదారుల నిరాశ్రయులవుతారు. ఉదాహరణకి పరిశ్రమలు నెలకొల్పేందుకు భూమి సేకరిస్తే కొందరు రైతులు నిరాశ్రయులవుతారు. ఐతే ఇది తాత్కాలిక సమస్య మాత్రమే. దీని గురించి అంత పట్టించుకోనవసరం లేదు. ఇలా నిరాశ్రయులైన వారంతా పెట్టుబడిదారీ అభివృద్ధి క్రమంలో తిరిగి తమ స్థానం ఎక్కడో ఒక చోట పొందగలుగుతారు.

అందుచేత ఈ చిన్న ఉత్పత్తిదారులను రక్షించాలనే పేరుతో పెట్టుబడిదారీ అభివృద్ధిని అడ్డుకోవడం తిరోగమన చర్య రాజకీయంగా ప్రయోజనం పొందటం కోసం ఇలా చేస్తున్నారే తప్ప ఆర్థిక విధానపరంగా చూస్తే ఇలా అడ్డుకోడంలో అర్థం లేదు.

4. కావాలంటే పశ్చిమ యూరప్ దేశాల అనుభవం చూడండి. ఇంగ్లండ్‌లో రైతుల పొలాల చుట్టూ కంచెలు నిర్మించి వారికి వ్యవసాయం చేయడం సాధ్యం కాకుండా చేసి వారిని పరిశ్రమల వైపు తరలించారు. దీనినే 'ఎన్‌క్లోజర్ మూవ్‌మెంట్' అంటారు. ఆ సమయంలో రైతులు నిరాశ్రయులై చాలా బాధలు పడ్డారు. కానీ పెట్టుబడిదారీ అభివృద్ధి జరిగిన క్రమంలో వీరంతా ప్రరిశ్రమలలో ఉద్యోగలు పొందారు.

భారత దేశం లాంటి మూడో ప్రపంచ దేశాలలో కూడా ఇదే విధంగా ప్రస్థుత భూసేకరణ వల్ల రైతులు ఇబ్బంది పడినా తర్వాత ప్రయోజనాలు పొందగలుగుతారు.

5. ఇంకొక అంశం : వ్యవసాయం, చేతి వృత్తులు వంటి చిన్న తరహా ఉ త్పత్తి విధానంలో జరిగే తలసరి ఆత్పత్తి తక్కువ స్థాయిలో ఉంటుంది. అందుచేత వేతనాల స్థాయి, అదనపు విలువ స్థాయి కూడా తక్కువగానే ఉంటుంది. దీని ఫలితంగా పెట్టుబడి పోగుపడడం కూడా తక్కవగానే ఉంటుంది. అటు శ్రామికులు జీవన ప్రమాణాల స్థాయి, పెట్టుబడి పోగయ్యే వేగం కూడా తక్కువగానే ఉంటుంది. 'అభివృద్ధి' జరగాలంటే పెట్టుబడి వేగంగా పోగుబడటానికి అనువుగా వాతావరణాన్ని మార్చాలి. అప్పుడే లాభాలార్జించాలన్న పెట్టుబడిదారుల 'కాంక్ష' రగులుకుని పరిశ్రమల స్థాపన వేగవంతం అవుతుంది. కార్మికులుగా వచ్చే వారి వేతనాల స్థాయి పెరుగుతుంది. పేదరికం పోతుంది.

పై వాదలన్నీ తప్పు ముందు సిద్ధాంతపరంగా చూద్దాం..

పెట్టుబడిదారీ విధానంలో సాంకేతిక స్థాయి ఒక దశలో స్థిరంగా ఉండి అదే దశలో ఎల్లకాలమూ కొనసాగినప్పుడే పై వాదన సరైన వాదనవుతుంది. సాంకేతిక స్థాయి ఒకే దశలో ఉంటే కార్మికుల ఉత్పాదకత కూడా ఒకే స్థాయిలో కొనసాగుతంది. ఉత్పత్తి పెరిగే కొద్దీ – అంటే పరిశ్రమలు పెరిగే కొద్దీ ఎక్కువ మంది కార్మికులు అవసరమూ పెరుగుతంది. ఆ విధంగా మొదట్లో నిరాశ్రయులైన వారు ఆ తర్వాత పరిశ్రమలలో కార్మికులుగా తిరిగి ఆశ్రయం పొందుతారు.

కాని పెట్టుబడిదారీ విధానం, సాంకేతిక స్థాయిని, నిరంతరం పెంచుకుంటూ పోవడానికే చూస్తుంది. ఆ విధంగా చూస్తేనే కార్మికుల తలసరి ఉత్పాదకత పెరుగుతంది. తద్వారా పరిశ్రమ యజమానికి మిగిలే అదనపు విలువా పెరుగుతంది. ఉత్పత్తితోబాటు ఉత్పాదకత కూడా పెరిగినప్పుడు అదనంగా కల్పించగలిగే ఉద్యోగాలు పెరగవు. ఉదాహరణకు పెట్టుబడిదారీ వ్యసవ్థలో ఒకానొక రంగంలో ఉత్పత్తి 8 శాతం పెరిగి, కార్మికుల ఉత్పాదకత 7 శాతం పెరిగిందనుకుందాం. అప్పుడు

అదనంగా పెరిగే ఉద్యోగాలు ఒక్క శాతం మాత్రమే ఉంటాయి. ఈ అదనపు ఉద్యోగాలు కూడా కార్మికుల జనాభా పెరుగుదలకు తగ్గినట్లు ఉండవు. ఒక రైతాంగం నుంచి వచ్చేవారికి ఉద్యోగాలు ఎక్కడి నుండి కల్పించగలుగుతారు? అందువలన పెట్టుబడిదారీ విధానంలో నిరంతరం సాంకేతిక పరిజ్ఞానం పెరుగుతూ పోతుందని, అందువలన అదనపు ఉద్యోగాలు కల్పించే సామర్థ్యం దానికి తగ్గిపోతూ వుంటుందని గమనిస్తే పెట్టుబడిదారీ సమర్థకుల వాదనలు తప్పు అని తేలిపోతుంది.

మరి పశ్చిమ యూరప్ దేశాలో నిరాశ్రయులైన రైతుల సంగతి ఏమైంది? నిరాశ్రయులైన రైతులందరికీ పరిశ్రమలలో ఉపాధి లభించిందని చెప్పడం పచ్చి అబద్ధం. వీరిలో చాలామంది పేదరికంలోనే మగ్గిపోయారు. వారిలో కొందరు కెనడా, అమెరికా, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికా, న్యూజిలాండ్ వంటి దేశాలకు వలసపోయారు. ఆ దేశాలలోని స్థానికులను తరిమి వేసి వారి భూములను ఆక్రమించుకుని మళ్లీ రైతులయ్యారు. ఇలా వలసలు పోయిన వారు 19వ శతాబ్దంలో యూరప్ ఖండంలో 5 కోట్ల మందికి పైగా ఉన్నారు.

ఇలా అనేకులు వలసపోవడం, ఇంకోపక్క యూరప్‌లో కొత్త పరిశ్రమలు నెలకొల్పడం జరిగినందుకు అక్కడ ఉన్న కార్మికులు తమ వేతనాలను పెంచుకోగలిగారు. బలమైన ట్రేడ్ యూనియన్ ఉద్యమాన్ని నిర్మించుకోగలిగారు. ఐతే యూరప్‌లో ఆ రోజుల్లో జరిగిన విధంగా కోట్లాది మంది నిరాశ్రయులు ఇతర దేశాలకు వలస పోవడమనదే ఈ వర్తమాన పరిస్థితులలో సాధ్యంకాని పని. నిజానికి ఇటీవల గల్ఫ్ ప్రాంతాల నుంచి యూరప్ దేశాలకు వలస వస్తున్న శరణార్థుల దయనీయ స్థితి వర్తమాన పరిస్థితులను సూచిస్తుంది.

కనుక పెట్టబడిదారీ సమర్థకులు ముందుకు తెచ్చి 'అభివృద్ధి' వాదలను సిద్ధాంతపరంగా గాని, చారిత్రకంగా గాని పసలేనివని, అవాస్తవాలని స్పష్టం అవుతున్నది. ఇక్కడ ఇంకో అంశాన్ని కూడా మనం చూడాల్సి ఉంది. ఉద్యోగాలు కావాలనే వారి సంఖ్య ఏ వేగంతో పెరుగుతుందో ఆ మేరకు ఉపాధి అవకాశాలను పెంచడంలో పెట్టుబడిదారీ వ్యవస్థ విఫలమౌతున్నది. అందువలన నిరుద్యోగ రిజర్వు సైన్యం పెరుగుతోంది. దీని పరవ్యవసారంగా కార్మికులు నిజ వేతనాల స్థాయి పడిపోతున్నది. అదే సమయంలో సాంకేతికాభివృద్ధి వలన కార్మికుల ఉత్పాదకత వేగంగా పెరుగుతోంది. అందుచేత అదనపు విలువలో పెట్టబడిదారులు పొందే వాటా శరవేగంగా పెరుగుతోంది.

మూడో ప్రపంచ దేశాలలో ఈ విధంగా అదనపు విలువలను చేజిక్కించుకుంటున్న సంపదన్న వర్గాలు అభివద్ధి చెందిన ధనిక దేశాలలోని సంపన్నులు

తరహాలో విలాసవంతంగా జీవించేందుకు తాపత్రయ పడుతున్నారు. వీరు ఉపయోగించే ఆధునిక ఉపకరణాలను తయారు చేయడానికి కొత్త మార్కెట్ అవసరమౌతుంది. ఐతే ఆ మార్కెట్ కొత్త ఉపాధి అకవశాలను పెద్దగా పెంచగలిగేది కాదు. మూడో ప్రపంచ దేశాలో ఆర్థిక అసమానతలు పెరగడంతో పాటు వేతనాలు స్థాయి కూడా పడిపోవడం వలస కార్మికకుల తరసరి ఉత్పాదక స్థాయి పెరుగుతోంది. ఇది ఇక్కడి పెట్టుబడిదారుల లాభాలను మరింత పెంచుతోంది. ఆ విధంగా ఒక విష వలయంలోకి ఆర్థిక వ్యవస్థ ప్రవేశించింది. పెట్టుబడిదారీ వ్యవస్థ ఉద్యోగాలు కల్పించగలిగే శక్తి కోల్పోతున్న కొద్ది వేతనాల స్థాయి పడిపోవడం, దాని పర్యవసానంగా తలసరి ఉత్పాదకత స్థాయి పెరగడం, అందువలన పెట్టుబడిదారుల అదనపు విలువ వాటా పెరగడం, ఆర్థిక అసమానతలు మరింతగా పెరిగిపోవడం - ఇదే ఆ విష వలయం.

అంటే పెట్టుబడిదారీ 'అభివృద్ధి' సాంప్రదాయ ఉత్పత్తి విధానం స్థానే తాను ప్రవేశించినప్పుడు నిరాశ్రయులైన వారికి ఉపాధి కల్పించే శక్తి దానికి లేదు. పైగా నిరుద్యోగాన్ని మరింత పెంచుతుంది. అంతకు ముందున్న స్థాయి కన్నా పేదరికం పెరుగుతుంది. ఆదే సమయంలో కొందరి దగ్గర సంపద పోగుబడే వేగమూ పెరగడం మనం చూస్తున్నాం. ఇదే అభివృద్ధి రేటు పెరుగుదలగా చిత్రీకరించబడుతుంది. ఎంత వేగంగా, వస్తుతంగా చిన్న ఉత్పత్తిదారులు, చేతి వృత్తుల వారు, రైతులు ఉపాధినీ, భమూలను కోల్పోయి నిరాశ్రయులవుతన్నారో మనం చూస్తున్నాం. ఈ భూమిని, ప్యాక్టరీల నిర్మాణం పేరుతో, హైవల విస్తరణ పేరుతో, మౌలిక సదుపాయాల కల్పన పేరుతో, రియల్ ఎస్టేట్ పేరుతో, గోల్ఫ్ మైదానాల పేరుతో కొందరు చేజిక్కించుకోవడమూ చూస్తున్నాం.

ఐతే మనకి ప్యాక్టరీలూ, మౌలిక సదుపాయాల కల్పనా అవసరం లేదా? తప్పకుండా అవసరమే. కాకపోతే ఇవి ప్రస్తుత పెటుబడిదారీ చట్రం పరిధిలోకి 'అభివృద్ధి' పథంలో జరిగితే పేదరికమూ, నిరుద్యోగమూ పెరగడమే తప్ప ప్రజలకు ఒరిగే అభివృద్ధి ఏమీ ఉండదు. భారతదేశం వంటి సమాజాల్లో పెట్టుబడిదారీ 'అభివృద్ధి' ఎంత వేగంగా జరిగినా, ప్రజలకు సంబంధించి అది ఎటువంటి ప్రయెజనాన్ని కలిగించదు.

మరి ప్రత్యామ్నాయం ఏమిటి? అభివృద్ధి పారిశ్రామీకరణ, ఉపాధి కల్పన ఎలా సాధ్యపడతాయి?

చిన్నతరహా ఉత్పత్తి విధానాన్ని పరిరక్షించడం, దానిని మరింత సమర్థవంతంగా, మెరుగ్గా నిర్వహించేందుకు వీలుగా సహకార, సమిష్టి వ్యవస్థలను పెంపొందించడం

అవసరం. ఇది సమానత్వం ప్రాతిపదికన అందరూ కలిస్తేనే సాధ్యపడుతుంది. అందకు భూ పంపిణీ జరగడం అవసరం. అవసరమైన పెట్టుబడిని సమకూర్చడానికి సాంకేతిక పురోగతిని సాధించడానికి ప్రభుత్వరంగ పాత్రను, చొరవను పెంచాలి. ఈ రంగాన్ని సహకార రంగంతో సమన్వయం చేయాలి. అప్పుడే సాంకేతిక ప్రగతి కొత్త ఉగ్యోగాలను కల్పించగలుగుతుంది. ఇదంతా జరగాలంటే ప్రభుత్వ వర్గ స్వభావం మారాలి. కార్మికులు, వ్యవసాయ కూలీలు, రైతులు, చేతి వృత్తిదారులు, ఇతర చిన్న తరహా ఉత్పత్తిదారులు - వీరందరినీ కలుపుకుని ఏర్పడే సంఘాల మీద ఆధారపడి ప్రత్యామ్నాయ ప్రభుత్వం ఏర్పడాలి.

ఇటువంటి ప్రత్యామ్నాయం వర్గ ప్రభుత్వం ఏర్పడే పరివర్తనా కాలంలో, అన్ని తరహాల అభ్యుదయ శక్తులూ ఐక్యమై నయా ఉదారవాద 'అభివృద్ధి' చక్రాన్ని బద్దలు చేసేందుకు పోరాడాలి.



# సోషలిజంలో ఎందుకు ఆర్థిక సంక్షోభం ఉండదు?

పెట్టుబడిదారీ విధానంలో ప్రజల కొనుగోలు శక్తికి మించి ఉత్పత్తి జరిగి, ఆ అదనపు ఉత్పత్తి అమ్ముడు పోనందున 'అధికోత్పత్తి సంక్షోభం' సంభవిస్తుంది. 'అధికోత్పత్తి సంక్షోభం' అంటే ప్రజల అవసరాలకు మించి ఉత్పత్తి జరగడం కాదు. ప్రజల వద్ద ఉన్న కొనుగోలు శక్తి పరిమితంగా ఉన్నందున ఉత్పత్తి జరిగినదంతా అమ్ముడుపోకపోవడం. ఇది ఎందుకు జరుగుతుంది? పెట్టుబడిదారులు కార్మికులకు అంతకంతకూ తక్కువ జీతాలు చెల్లించడం ఒక కారణం. ఇంకోవైపు ఎప్పటికప్పుడు కొత్త టెక్నాలజీని తెచ్చి తక్కువ మంది కార్మికులతో ఎక్కువ పని చేయించుకోవడంతో కార్మికుల సంఖ్య తగ్గడం రెండో కారణం. అయితే ఒకసారి అధికోత్పత్తి సమస్య రాగానే పెట్టుబడిదారులు ఏం చేస్తారు? ఉత్పత్తిని తగ్గిస్తారు. దాంతో కార్మికులు పనులు కోల్పోతారు. ఉత్పత్తి తగ్గడంతో 'మాంద్యం' ఏర్పడుతుంది. మరోవైపు కొనుగోలు శక్తీ తగ్గిపోతుంది.

పెట్టుబడిదారీ వ్యవస్థలో ఇటువంటి 'ఆర్థిక మాంద్యం' పరిస్థితులు అప్పుడప్పుడు ఏర్పడడం సహజమేనని, మళ్లీ మార్కెట్ సరిదిద్దుకుని మాంద్యం నుండి బైట పడిపోతుందని, ముందుకు పురోగమిస్తుందని కొందరు పండితులు చెప్తూ వుంటారు. అయితే ఇది వాస్తవం కాదు. 1930 దశకం లోని ఆర్థిక మాంద్యం ఒక దశాబ్దం పైగా కొనసాగింది. ఆ తర్వాత వచ్చిన ప్రపంచ యుద్ధంతో మిలిటరీ వ్యయం పెరిగి తద్వారా సంక్షోభం నుండి బైట పడింది. అంటే సంక్షోభానికి మూల్యంగా అపార జన నష్టం, ఆస్తి విధ్వంసం, రక్తపాతం చెల్లించాల్సి వచ్చిందన్నమాట.

ఇప్పుడు 2008 నుండి మళ్లీ 'అధికోత్పత్తి సంక్షోభం' మొదలైంది. నేటికీ అది కొనసాగుతూనే ఉంది. సంక్షోభ పరిస్థితులను దాటేశామని అప్పుడప్పుడూ

ఆర్థిక నిపుణులు కొందరు నమ్మబలుకుతున్నా, సంక్షోభం నానాటికీ ముదురుతూనే వుంది. ఇంకోవైపు ప్రజల కొనుగోలు శక్తి తగ్గుతూనే వుంది. మరో వైపు ప్రభుత్వాలు ప్రజల సంక్షేమం మీద కోతలు విధిస్తూ కార్పొరేట్లకు అదనపు రాయితీలు ఇస్తూనే వున్నాయి. పెట్టుబడిదారీ వ్యవస్థ లోనే ఈ సంక్షోభానికి మూలాలు ఉన్నాయి. లాభం కోసమే ఉత్పత్తి అన్న సూత్రమే దీనికి ప్రధాన కారణం.

అయితే ఏడు దశాబ్దాలు సోవియట్ యూనియన్‌లో, తూర్పు యూరపు దేశాల్లో కొనసాగిన సోషలిస్టు వ్యవస్థలో ఇటువంటి సంక్షోభాలు ఎన్నడూ రాలేదు. పెట్టుబడిదారీ వ్యవస్థలో వచ్చే ఏడాది డిమాండ్ ఎంత పెరగొచ్చు అన్నది లెక్క వేసుకుని ఈ ఏడాది పెట్టుబడిని పెడతారు. ఈ లెక్క వేయడానికి ఈ ఏడాది డిమాండ్ ఎంత పెరిగింది అన్నది కొలబద్దగా తీసుకుని అంచనా కడతారు. ఈ ఏడాది డిమాండ్ తగ్గింది అన్న సూచన గనుక వస్తే వచ్చే ఏడు కోసం పెట్టే పెట్టుబడిని తగ్గించేస్తారు. పెట్టాల్సిన పెట్టుబడి తగ్గే సరికి జనం దగ్గరికి వచ్చే డబ్బు తగ్గిపోతుంది. దాంతో వినిమయం తగ్గిపోతుంది. సోషలిజంలో ఈ రెండు రకాల ధోరణులూ ఉండవు.

సోషలిజంలో ఒక ప్రణాళిక ప్రకారం పెట్టుబడులు పెడతారు. లాభం ఎంత వస్తుంది? అన్న లెక్కన ఈ పెట్టుబడి పెట్టరు. ఒక వేళ ఏదైనా కారణం వలన ఒక ఏడాది డిమాండ్ తగ్గినా, ప్రణాళిక ప్రకారం ఆ ఏడాది పెట్టవలసిన పెట్టుబడులు ఆపరు. అందువలన సంక్షోభం వచ్చే అవకాశం ఉండదు. అయితే సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ నడకలో ఎగుడు దిగుళ్లు ఉండనే ఉండవా అంటే ఉంటాయి. ఆ ఎగుడు దిగుళ్లు లాభనష్టాలను బట్టి వుండవు.

ఒక తరహా ఎగుడు దిగుడులకు వ్యవసాయోత్పత్తిలో వచ్చే ఒడిదుడుకులు కారణం. ప్రకృతి వైపరీత్యాల వల్ల, వ్యవసాయోత్పత్తులు తగ్గిపోయే పరిస్థితులు ఉంటే పెట్టుబడులు ఆ మేరకు తగ్గిస్తారు. దానివలన ప్రజల వద్ద డబ్బు తగ్గుతుంది. ఆహార ఉత్పత్తులు తగ్గినా, ప్రజల కొనుగోలు శక్తి కూడా అదే మోతాదులో తగ్గడంతో ధరలు పెరగకుండా స్థిరంగా ఉంటాయి. అదేవిధంగా వాతావరణం అనుకూలించి వ్యవసాయోత్పత్తులు పెరిగే అవకాశం ఉంటే పెట్టుబడిని ఆ మేరకు పెంచుతారు. దాంతో పెరిగిన ఉత్పత్తులకు తగిన మోతాదులో ప్రజల దగ్గర డబ్బు పెరిగి, అప్పుడు ధరలు పడిపోకుండా స్థిరంగా ఉంటాయి. కనుక సోషలిస్టు వ్యవస్థలో పెట్టుబడులు పెట్టడంలో ఉండే ఎగుడు దిగుడులకు లాభనష్టాలతో సంబంధం లేదు.

పెట్టుబడుల ప్రవాహంలో ఎగుడు దిగుడులు సోషలిస్టు వ్యవస్థలో ఇంకో కారణం వల్ల కూడా జరుగుతాయి. ప్రణాళికా కాల ప్రారంభంలో కొన్ని కొత్త రంగాలలో అభివృద్ధి కోసం, కొత్త పరిశ్రమల ఏర్పాటు కోసం అదనపు పెట్టుబడులు పెడతారు.

కొన్నేళ్ల తర్వాత వాటి స్థానంలో అంతకంటే మెరుగైన కొత్త పరికరాలను తీసుకురావాల్సి వుంటుంది. పాత వాటిని తొలగించి కొత్తవి పెట్టడానికి అధిక పెట్టుబడి కావాలి. అటువంటి మార్పులు జరిగే కాలంలో అవసరమైన అధిక పెట్టుబడులు ఆ ముందు, తర్వాత ఉండవు. అలా ఎగుడు దిగుడులు ఎటువంటి సంక్షోభాలకూ దారి తీయవు. పెట్టుబడులు తగ్గినా, ఆ మేరకు ధరలనూ తగ్గించి తద్వారా డిమాండ్ కొరత లేకుండా చూసుకుంటారు. డిమాండ్ లేదన్న పేరుతో ఉత్పత్తులను తగ్గించడం, నిరుద్యోగాన్ని సృష్టించడం వంటివి అక్కడ ఉండవు. ఉత్పత్తి పూర్తి సామర్థ్యం మేరకు జరుగుతుంది. ఉత్పత్తి అయిన సరుకంతా అమ్ముడయ్యేలా ధరలు సర్దుబాటు అవుతాయి. 'లాభం కోసం ఉత్పత్తి' అన్న సూత్రం సోషలిజంలో పని చేయదు కనుకనే అక్కడి ఆర్థిక వ్యవస్థలో ఇటువంటి సర్దుబాట్లు చేసుకోగలిగే సామర్థ్యం ఉంటుంది. మరి ఇలా మార్కెట్‌ను బట్టి కొన్ని సరుకుల ధరలు తగ్గించేస్తే ఆ సరుకులను తయారు చేసిన పరిశ్రమలు నష్టపోవా? నష్టపోతాయి. ఇలా నష్టపోయే కంపెనీలు ఉన్నట్టే లాభాలు వచ్చే కంపెనీలూ ఉంటాయి. ఆ నష్టాలు, ఈ లాభాలు అన్నీ కలబోసుకోవడం సోషలిజంలో సాధ్యం. ఎందుకంటే అది 'ఉమ్మడి యాజమాన్య వ్యవస్థ'. అటువంటి కలబోసుకోవడం వ్యక్తిగత యాజమాన్యం ఉండే పెట్టుబడిదారీ వ్యవస్థలో అసాధ్యం. మొత్తం అన్నీ కలబోసుకున్నప్పుడు పెట్టుబడులు పెరిగిన సంవత్సరాలన్నింటి లోనూ నికర లాభాలుంటాయి. పెట్టుబడులు తగ్గినప్పుడు ఆ మేరకు నికర నష్టాలుంటాయి.

అదే పెట్టుబడిదారీ సమాజంలోనైతే సంక్షోభంలో ఉత్పత్తీ తగ్గుతుంది. దాంతోపాటే ఉపాధి అవకాశాలూ తగ్గిపోతాయి. కొనుగోలు శక్తీ తగ్గుతుంది. కొనుగోలు శక్తి తగ్గినప్పటికీ ధరలు తగ్గవు. ఉద్యోగాలు పోతాయి. అదే సోషలిజంలో కొనుగోలు శక్తి తగ్గితే ధరలూ తగ్గుతాయి. ఉత్పత్తి తగ్గదు కనుక ఉద్యోగాలేమీ పోవు.

ఇంకో వైపు నుంచి చూద్దాం. ఉద్యోగాలు తగ్గకుండా, ఉత్పత్తీ తగ్గకుండా ధరలు తగ్గడం అంటే అర్థం ఏంటి? మొత్తం ఉత్పత్తి అయిన సంపదలో కార్మికులు వాటా పెరగడం అన్నమాట. ఇది సోషలిజంలో మాత్రమే సాధ్యం. కార్మికులు తమ వాటాగా వచ్చే ఆదాయాన్నంతా తిరిగి ఖర్చు చేస్తారు కనుక మొత్తం వినిమయంలో వారి వాటా పెరుగుతుంది. అంతే తప్ప సోషలిజంలో అధికోత్పత్తి సమస్య ఎప్పుడూ రాదు.

అదే పెట్టుబడిదారీ వ్యవస్థలో పెట్టుబడిదారులు సంపదలో తమ వాటా తగ్గడానికి ఏ మాత్రమూ అంగీకరించరు గనుక డిమాండ్‌కి కొరత ఉన్నా ధరలను తగ్గించకుండా ఏర్పాటు చేస్తారు. కార్మికుల వేతనాలనూ పెంచరు. దాని ఫలితంగా సరుకు చెల్లుబాటు గాకుండా ఉంటుంది. అధికోత్పత్తి సమస్య ఉత్పన్నమౌతుంది.

సమాజంలో ఉత్పత్తయ్యే సంపదలో తమ వాటాను తగ్గించుకోడానికి పెట్టుబడిదారులు సిద్ధం కానందువల్లనే సంక్షోభం వస్తుంది. వాళ్లు దాన్నుంచి తప్పించుకోడానికి ఉత్పత్తిని తగ్గించి, కార్మికుల వేతనాలు తగ్గిస్తారు. ఈ రెండు చర్యలూ కార్మికుల వాటాను మరింత తగ్గిస్తాయి. పెట్టుబడిదారుల వాటాను మరింత పెంచుతాయి. అందుకే ఒక పక్క సంక్షోభం కొనసాగుతూనే ఉంటుంది. మరోపక్క పెట్టుబడిదారుల సంపద పెరుగుతూనే ఉంటుంది.

ఈ సంక్షోభమూ, దానికి పెట్టుబడిదారులు ప్రతిస్పందించే తీరూ ఈ పెట్టుబడిదారీ వ్యవస్థ ఎంత అర్థరహితమో స్పష్టంగా వెల్లడి చేస్తాయి. ఒకపక్క ఉత్పత్తి అయిన సంపద చెల్లుబాటు గాక వృధాగా పడి వుంటోంది. ఇంకోపక్క అది దక్కవలసిన ప్రజలు అవసరాలు తీరక, కొనగలిగే శక్తీ లేక అవస్థలు పడు తున్నారు. అటు అపారమైన మానవ వనరులు వినియోగం లేక నిరుద్యోగం పెరిగి, అభివృద్ధీ స్తంభించిపోతోంది.

అదే సోషలిజం లోనైతే ఉత్పత్తి తగ్గడం ఉండదు. ఉత్పత్తి అయిన సరుకులన్నీ చెలామణీ అయ్యేలా ధరలు అవసరమైనప్పుడల్లా తగ్గిస్తారు. ప్రజల అవసరాలూ తీరుతాయి. ఉత్పత్తి తగ్గదు కనుక నిరుద్యోగమూ ఉండదు. మానవ వనరులు పూర్తి వినియోగంలోకి వస్తాయి గనుక ఆర్థిక వ్యవస్థ అభివృద్ధీ ఆగదు.

సోవియట్ సోషలిస్టు వ్యవస్థ నిర్వహణలో ఇతరత్రా లోపాలు దొర్లి వుండవచ్చు. కాని అది కొనసాగినంత కాలమూ సంక్షోభ రహితంగానే కొనసాగింది. అదే సోషలిజం విశిష్టత. ప్రస్తుతం పెట్టుబడిదారీ సంక్షోభానికి పరిష్కారాలు దొరకడం లేదని ఆందోళన పడుతున్న వారు ఈ సమాధానం వైపు చూడరెందుకని?



# ఈ మంత్రాలకు ఆర్థిక వ్యవస్థ కోలుకుంటుందా..!

"ఏ మనిషినైనా మంత్రాలతో చంపెయ్యొచ్చు., ఐతే దానితోపాటు కాస్త విషం కూడా ఇవ్వాలి" అని వోల్టేర్ అన్నాడు. వోల్టేర్ హేతువాది. అందుకే మంత్రాలు పనిచెయ్యవని, విషం ఇస్తే తప్ప మనిషి కేవలం మంత్రాలతో చావదని అన్నాడు. ఇక్కడ మన బిజెపి ప్రభుత్వం చూస్తే హేతువాదాన్ని ఒప్పుకోదు. అందుచేత కేవలం మంత్రాలతోటే ఆర్థిక వ్యవస్థను కోలుకునేలా చేయాలని చూస్తోంది. ఇటీవల పార్లమెంటుకు సమర్పించిన 2021-22 కేంద్ర బడ్జెట్‌లో ఆర్థికమంత్రి ఇచ్చిన వాగ్దానం ఇదే.

రిజర్వు బ్యాంకు అంచనా ప్రకారం 2020-21లో మన ఆర్థిక వ్యవస్థ ఆ ముందటి ఏడాదితో పోల్చితే 7.7 శాతం కుంగిపోయింది. ప్రస్తుత సంవత్సరం తో పోల్చితే 2021-22లో 10.5 శాతం కోలుకుంటుంది. (ఆర్థిక సర్వేలో 11 శాతం కోలుకుంటుందని అంచనా వేశారు. ఈ రెండింటిమధ్య తేడా కి పెద్ద ప్రాధాన్యత లేదు. ఈ వ్యాసంలో నేను చెప్పే వాదన 10.5 వృద్ధి అంచనాకు వర్తిస్తే అది 11 శాతం వృద్ధి అంచనాకు ఇంకా బాగా వర్తిస్తుంది) ఈ లెక్కలబట్టి చూస్తే 2019-20 తో పోల్చినప్పుడు 2021-22 ఆర్థిక సంవత్సరంలో జిడిపి లో నామమాత్రపు వృద్ధి (గట్టిగా చెప్పాలంటే 2 శాతం) మాత్రమే ఉంటుంది. ఈ అంచనా ప్రాతిపదికనే ప్రభుత్వం చూపిస్తూ వి-ఆకారపు( ఇంగ్లీషు లో వి అక్షరం ఆకారం) రికవరీ గురించి మాట్లాడుతున్నారు. అంటే ఏ ఎత్తునుంచి ఆర్థిక వ్యవస్థ గోతిలో పడిపోయిందో తిరిగి అదే ఎత్తుకు చేరుకుంటుంది అని అర్థం. ఇప్పుడు గోతిలో ఉన్న పరిస్థితినుండి 10.5 శాతం రికవరీతో తిరిగి కోలుకోవాలంటే అందుకు దోహదం చేసే వివిధ అంశాలను ఒకసారి పరిశీలిద్దాం.

ఒక దేశపు జిడిపి ఆ దేశపు వినియోగం (సి)ం పెట్టుబడి(ఐ)ంప్రభుత్వ వ్యయం (జి)ంనికర ఎగుమతులు (మొత్తం ఎగుమతులు మైనస్ మొత్తం దిగుమతులు లేదా ఇ మైనస్ ఎం) తో సమానంగా ఉంటుంది. అందుచేత జిడిపి 10.5 శాతం పెరగాలంటే పైన తెలిపిన అంశాలన్నింటిలోనూ ఆ మేరకు పెరుగుదలను 2020-21 తో పోల్చితే రాబట్టాలి. వచ్చే ఏడాది కాలంలో నికర ఎగుమతులు ఎంత పెరుగుతాయో, లేదా తరుగుతాయో ఇప్పుడు ఎవరూ చెప్పగలిగే పరిస్థితి లేదు. అందుచేత దానిని పక్కన పెడదాం. ఇక తక్కిన సింఐంజి లోనే 10 శాతం పైగా వృద్ధి సాధించాలి. అందుకు దోహదపడే విధాన పరమైన చర్యలేమైనా ఈ బడ్జెట్‌లో ప్రకటించారేమో చూద్దాం.

2020-21 సవరించిన అంచనాల ప్రకారం ప్రభుత్వ వ్యయం రు.34.503 లక్షల కోట్లు. ఇది 2021-22లో రు.34.832 లక్షల కోట్లకు పెరుగుతుంది. ద్రవ్యోల్బణాన్ని పక్కనబెట్టి లెక్క కడితే ఇది ఒక శాతం కన్నా తక్కువ పెరగనుంది. పెరిగే ధరలను పరిగణిస్తే వాస్తవంగా ప్రభుత్వ వ్యయం తగ్గనుంది. ప్రభుత్వ వ్యయం ద్వారా మార్కెట్‌లో డిమాండ్ పెరుగుదలకు ఎంత అదనపు దన్ను వస్తుంది అని చూస్తే మాత్రం గతేడాది మహమ్మారి కాలంలో వచ్చిన దానికన్నా తక్కువే ఉంటుందని స్పష్టమవుతుంది.

సాధారణంగా జిడిపి ఏ రేటున పెరుగుతుందో అదే రేటున వినిమయం పెరుగుతుంది. కాని వచ్చే ఏడాదిలో ఈ విధంగా జరగకపోవచ్చునని చెప్పడానికి కొన్ని కారణాలున్నాయి. జిడిపి వృద్ధి చెందే రేటు కన్నా తక్కువ రేటులో వినిమయం పెరిగే సూచనలే ఉన్నాయి. మహమ్మారి కాలంలో చాలామంది కార్మికులు తమ అవసరాలకోసం అప్పులు చేశారు. అకస్మాత్తుగా విధించిన లాక్‌డౌన్ కారణంగా వారు పనులను కోల్పోయారు. దానితో వారి ఆదాయాలూ లేకుండా పోయాయి. అందుకే వారు అప్పులు చేయవలసివచ్చింది. ఇప్పుడు వారి ఆదాయాలు పెరిగినప్పటికీ, వారు చేసిన అప్పులను తిరిగి చెల్లించవలసివుంటుంది. అందుచేత ఏ మేరకు ఆదాయాలు పెరిగాయో అదే మేరకు వారి వినిమయం పెరిగే అవకాశం లేదు. ప్రభుత్వ వ్యయంలో ఒక శాతం పెరుగుదల ఉన్నా, వినిమయం లో ఆ ఒక శాతం పెరుగుదల కూడా ఉండే అవకాశం లేదు. ప్రభుత్వం చెప్తున్నట్టు 10.5 శాతం జిడిపి లో పెరుగుదల వచ్చినా, వినిమయంలో అదే మేరకు పెరుగుదల ఉండదు.

ఇక మిగిలినది ప్రైవేటు పెట్టుబడి, బడ్జెట్‌లో ప్రస్తావించని పబ్లిక్ పెట్టుబడి మాత్రమే. పబ్లిక్ పెట్టుబడి అంటే ప్రభుత్వరంగ సంస్థలు పెట్టే పెట్టుబడి వంటివి. మహమ్మారి కాలంలో లాక్‌డౌన్ కారణంగా అనేక ప్రాజెక్టుల పనులు అర్ధాంతరంగా

నిలిచిపోయాయి. ఒకసారి లాక్‌డౌన్ సడలించగానే ఆ నిలిచిపోయిన ప్రాజెక్టు పనులను త్వరగా పూర్తి చేయడానికి ఒక్కసారి పెట్టుబడి వ్యయాన్ని పెంచవలసివచ్చింది. ఇది గతేడాది సంగతి. ఇక వచ్చే ఏడాది 2021-22 సంగతి చూస్తే, పెట్టుబడి వ్యయం గతేడాది తీసుకున్న నిర్ణయాల ఆధారంగా జరుగుతుంది. (ఇంకా పూర్తి కాకుండా నడుస్తూవున్న పనులను మినహాయించితే) గతేడాది కరోనా కాలం. ఉత్పత్తి కుంచించుకుపోయిన కాలం. 2021-22లో మహా అయితే 2019-20 నాటి స్థాయికి తిరిగి ఉత్పత్తి చేరుతుందని అంచనా వేశారు. ఆ స్థాయి ఉత్పత్తిని చేయడానికి కావలసిన సామర్థ్యం ఇదివరకే ఉంది. కనుక అదనంగా ఉత్పత్తి సామర్థ్యం పెంచవలసిన అవసరం పెద్దగా లేదు. ఉన్నదే సరిపోతుంది. కొత్తగా పెట్టుబడులు పెట్టడానికి ఎవరూ పెద్దగా పూనుకోరు. అందుచేత 2020-21 తో పోల్చితే పెట్టుబడికి, ఆదాయాలకు మధ్య నిష్పత్తి 2021-22లో తక్కువగానే ఉంటుంది.

మొత్తంగా చూసినప్పుడు జిడిపి లో అంతర్భాగాలైన (నికర ఎగుమతుల గురించి ఎవరికీ ఇప్పుడే ఎటువంటి అంచనా ఉండే అవకాశం లేదని ముందే చెప్పుకున్నాం) వినిమయం, పెట్టుబడి, ప్రభుత్వ వ్యయం- ఈ మూడింటిలోనూ 10.5 శాతం కన్నా తక్కువే వృద్ధి ఉంటుంది. ఒకవేళ ప్రభుత్వం చెప్పుకుంటున్నట్టు జిడిపి 10.5 శాతం పెరిగినా, దాని వినియోగం అదే మోతాదులో పెరగదు. (అనూహ్యంగా ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో బ్రహ్మాండమైన బూమ్ వచ్చేసి మన సరుకులకు విపరీతంగా ఇతర దేశాలలో డిమాండ్ వచ్చేసి ఎగుమతులు అమాంతం పెరిగిపోతే తప్ప) వినిమయం ఉండబోవడం లేదని నిర్ధారణ అయిన తర్వాత ఇక ఉత్పత్తి మాత్రం ఎందుకుంటుంది? అదీ ఉండదు.

అంచనా వేసిన స్థాయిలో ఉత్పత్తి గనుక ఉండకపోతే అది వినిమయాన్ని మరింత తగ్గిస్తుంది. అంటే వృద్ధిరేటు అంచనా వేసిన మేరకు ఉండదు.

అందుచేత మన భారత ఆర్థిక వ్యవస్థలో వి-ఆకారంలో రికవరీ ఉంటుందని భావించడానికి ఎటువంటి ప్రాతిపదికా లేదు. ఈ బడ్జెట్ అటువంటి రికవరీకి ఏ విధంగానూ తోడ్పడడం లేదు. ప్రభుత్వ వ్యయంలో వాస్తవ పెరుగుదలకు బడ్జెట్ ఏ విధమైన కేటాయింపులూ చేయలేదు. 10.5 శాతం వృద్ధి రావాలంటే కనీసం ప్రభుత్వ వ్యయాన్ని 10.5 శాతమైనా పెంచాలి కదా. కాని బడ్జెట్ గతేడాది వ్యయం కన్నా తక్కువగానే వాస్తవ వ్యయాన్ని ప్రతిపాదించింది.

ఇక్కడ ఇంకో అంశాన్ని కూడా చూడాలి. 2020-21లో ద్రవ్యలోటు 9.5 శాతం. ఇది 2021-22లో 6.8 శాతం గా ఉండబోతుందని బడ్జెట్‌లో అంచనా వేశారు. ప్రభుత్వ వాస్తవ వ్యయం పెరగకపోయినా జిడిపి 10.5 శాతం పెరుగుతుందని

లెక్కవేసి, దానికి తగ్గట్టు పన్నుల ద్వారా వచ్చే ఆదాయం పెరుగుతుందని లెక్కగట్టారు. కాని జిడిపి అంచనాలమేరకు పెరగకపోతే, ప్రభుత్వ వ్యయం బడ్జెట్ ప్రకారమే జరిగినా ద్రవ్యలోటు మాత్రం బాగా పెరుగుతుంది. ద్రవ్యలోటును తగ్గించాలని గనుక ప్రభుత్వం భావించి ప్రభుత్వ వ్యయాన్ని తగ్గిస్తే వృద్ధి రేటు ఇంకా తగ్గిపోతుంది.

అందుచేత ఈ బడ్జెట్ మన దేశ ఆర్థికవ్యవస్థ కోలుకోడానికి ఎంత మాత్రమూ దోహదపడేదిగా లేదు. దీని పర్యవసానంగా మన దేశాన్ని కొన్నేళ్ళుగా పీడిస్తున్న నిరుద్యోగ సమస్య మరింత తీవ్రంగా మారుతుంది. ఇప్పటికే కరోనా కాలంలో అది తీవ్ర రూపం దాల్చింది. ఒకవేళ బడ్జెట్‌లో అంచనా వేసినట్టు వృద్ధిరేటు వచ్చినా అది బడా కార్పొరేట్ సంస్థల్లో, సంఘటిత రంగంలో మాత్రమే ఎక్కువగా ఉండి చిన్నఉ త్పత్తిదారులను దెబ్బతీసే విధంగా ఉండబోతుంది. దానివలన వృద్ధిరేటు పెరిగినా నిరుద్యోగం మాత్రం బాగా పెరుగుతుంది. అర్థంలేని నోట్లరద్దు తో మోడీ ప్రభుత్వం ఇదివరకే చిన్న ఉత్పత్తిదారులను బాగా దెబ్బ తీసింది. దానికి లాక్‌డౌన్ తోడైంది. చిన్న తరహా ఉత్పత్తిలో కలిగే ఉపాధి అవకాశాలు ఎక్కువగా ఉంటాయి. ఇప్పుడా చిన్న తరహా ఉత్పత్తి కోలుకోలేని స్థితిలో పడి చితికిపోతే నిరుద్యోగం మరింత తీవ్రతరమవుతుంది. ఇక వృద్ధిరేటు అనుకున్న విధంగా గనుక రాకపోతే ఈ సమస్య ఇంకా భయంకరంగా మారుతుంది.

ప్రస్తుత పరిస్థితిలో ఎటువంటి బడ్జెట్ మన దేశానికి అవసరమో సరిగ్గా దానికి పూర్తి వ్యతిరేక దిశలో ఈ బడ్జెట్ ఉంది. చాలామంది ఈ బడ్జెట్ ఆర్థిక రికవరీకి తోడ్పడుతుందని మెచ్చుకోవడం ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది. బహుశా బడ్జెట్ ప్రసంగంలో అత్యంత చీదర పుట్టించే పదాలను అత్యంత అట్టహాసంగా ప్రయోగించడంతో వాస్తవ స్థూల ఆర్థిక చిత్రం కాస్తా కనపడకుండా పోయిందనుకుంటాను.



# సోషలిజం ఆవశ్యకత తెలియజేస్తున్న మహమ్మారి

సంక్షోభ సమయం వచ్చినప్పుడు ప్రతివాడూ సోషలిస్టు అయిపోతాడు. 'స్వేచ్ఛా మార్కెట్లు' వెనక్కిపోతాయి. దీనివలన కష్ట జీవులకు (తాత్కాలికంగానైనా) కొంత ప్రయోజనం కలుగుతుంది. రెండో ప్రపంచ యుద్ధ కాలంలో బ్రిటన్‌లో ఉచిత రేషనింగ్ విధానాన్ని ప్రవేశ పెట్టారు. దాని ఫలితంగా సగటు కార్మికుడు అంతకు ముందు కన్నా మరింత మెరుగైన పోషకాహారం పొందగలిగాడు. ఇదొక ఉదాహరణ. అలాగే, ప్రైవేటు కంపెనీలన్నీ యుద్ధ ప్రయత్నాలకు తోడ్పడే విధంగా ఉత్పత్తులను చేపట్టవలసి వచ్చింది. ఈ క్రమంలో ప్రైవేటు కంపెనీల మీద ప్రభుత్వ నియంత్రణ పెరిగింది. ఒక విధమైన ప్రణాళికా విధానం, ఆ పేరు చెప్పకపోయినా, అమలులోకి రాక తప్పలేదు.

ప్రస్తుతం కోవిడ్-19 మహమ్మారి విస్తరించిన నేపథ్యంలో కొంచెం ఇంచుమించుగా పైన ప్రస్తావించిన తరహాలోనే పరిణామాలు జరుగుతున్నాయి. వరసగా ఒక దాని తర్వాత మరొక దేశంలో వైద్య, ఆరోగ్య వ్యవస్థను సామాజికీకరణ (సమాజపరం) చేస్తున్నారు. దానితోబాటు నిత్యావసర సరుకుల ఉత్పత్తి, పంపిణీని కూడా జాతీయం చేస్తున్నారు. ఇది పెట్టుబడిదారీ నియమాలకు పూర్తి విరుద్ధం. సంక్షోభం తీవ్రత ఎంత ఎక్కువగా ఉంటే సామాజికీకరణ అంత ఎక్కువ మోతాదులో జరుగుతోంది. యూరప్‌లో కోవిడ్-19 తాకిడి అతి ఎక్కువగా ఇటలీని తాకింది. ఆ తర్వాత స్పెయిన్ ఎక్కువగా ప్రభావితమైంది. ఆ స్పెయిన్‌లో ఈ ప్రభావాన్ని తట్టుకోడానికి మొత్తం ప్రైవేటు ఆస్పత్రులనన్నింటినీ జాతీయం చేసేశారు. ఇప్పుడు అవన్నీ ప్రభుత్వ అధీనంలో ఉన్నాయి. ఆఖరుకు డొనాల్డ్ ట్రంప్ కూడా ప్రస్తుత పరిస్థితుల్లో ఈ మహమ్మారిని తట్టుకోవడానికి అవసరమైన ఉత్పత్తులన్నీ చేపట్టాలని ప్రైవేటు కంపెనీలను ఆదేశిస్తున్నాడు! అంటే ప్రైవేటు కంపెనీల మీద ప్రభుత్వం

అదుపు ఉండడం అనేది ఇప్పుడు ఒక్క చైనాకే పరిమితమైన ధోరణి కాదు. అది అమెరికా విధానం కూడా! యూరపు దేశాల సంగతి వేరే చెప్పనక్కర్లేదు.

ఈ కోవిడ్-19 ప్రభావం పడిన దేశాలు 'సోషలిస్టు' విధానంగా కనిపించే పద్ధతుల వైపు మొగ్గు చూపడానికి ఇంకో కారణం కూడా ఉంది. ప్రస్తుత పరిస్థితుల్లో శాస్త్రీయ దృక్పథం అనుసరించడం ఎంతైనా అవసరం, అనివార్యం. శాస్త్రీయ దృక్పథం అనుసరించడం అంటేనే అది సోషలిజం వైపు వేసే ఒక పెద్ద అడుగు. ఇంతవరకూ ఆవు పేడ విశిష్టత గురించి, గోమూత్రం అమోఘ లక్షణాల గురించి, దానితో కరోనా వైరస్‌ను నియంత్రించవచ్చన్న ప్రకటనల గురించి ప్రస్తావిస్తూ వచ్చిన హిందూత్వ శక్తులు ప్రజల నుంచి ఛీత్కారాలను ఎదొర్కొంటున్నారు. ఇటువంటి సమయాల్లో పనికిమాలిన 'చెత్త' మాట్లాడొద్దని ఆగ్రహిస్తున్నారు. ఇటువంటి 'గొప్ప' విషయాలను ఇంతవరకూ ప్రచారం చేసిన వాళ్లు సైతం దగ్గో, తుమ్మో రాగానే ఆరోగ్య రక్షణకి ఆస్పత్రులకే పరుగెత్తుకొస్తున్నారు. వారిలో ఎవరైనా 'శిఖామణులు' మొండికేస్తే ఆ కుటుంబ సభ్యులే ఈడ్చుకొచ్చి ఆస్పత్రులలో చేర్పిస్తున్నారు. ఇటువంటి సమయాల్లో మూఢ విశ్వాసాలను ఆచరించడం ప్రాణం మీదకి తెస్తుంది. అందుచేత ప్రస్తుత పరిస్థితే వారి ఆలోచనలో మూఢ నమ్మకాల పట్ల విముఖతను కలిగిస్తుంది. ఆ మేరకు వారు సోషలిజం అనే శాస్త్రీయ భావనకు చేరువవుతారు.

అయితే ఈ విషయంలో కూడా భారతదేశం ఇతర దేశాలతో పోల్చితే వెనకబడే వుంది. అటు తప్పనిసరై శాస్త్రీయ దృక్పథాన్ని అనుసరించడంలో గాని, ఇటు వైద్య సేవలను, కీలక ఉత్పత్తులను సమాజపరం చేయడంలో గాని మన దేశం వెనకే వుంది. ఒక పక్క మహమ్మారి విజృంభిస్తున్నా మూఢ నమ్మకాల చౌకబారు ప్రచారం, వెకిలి ప్రకటనలు ఆగడం లేదు. మార్చి 22న జనతా కర్ఫ్యూ సందర్భంగా వైద్య ఆరోగ్య కార్యకర్తలను అభినందిస్తూ అయిదు నిమిషాలపాటు చప్పట్లు కొట్టమని మోడీ ప్రకటించారు. అయితే మోడీ భక్తులు ఈ కార్యక్రమాన్ని అరగంట సేపు సాగదీశారు. ఊరేగింపులు తీశారు. గంటలు మోగించారు. శంఖాలూదారు. ఆరోజు ఉదయం నుండీ చేసిన కర్ఫ్యూ ప్రభావం కాస్తా ఈవిధంగా గుంపులుగా చేరి చేసిన గోల వల్ల ఎగిరిపోయింది. భౌతిక దూరం పాటించాలన్న సూత్రాన్ని గాలికొదిలేశారు.

ఇప్పుడు వైద్య పరీక్షలు చేసి వ్యాధి సోకిందీ లేనిదీ నిర్ధారించే పనిని ప్రైవేటు ఆస్పత్రులు కూడా చేపట్టాలని ప్రభుత్వం ఆదేశించింది. అయితే, ఈ పరీక్షల్లో కోవిడ్-19 ఉన్నట్లు నిర్ధారణ అయితే అటువంటి వారికి వైద్యం ఉచితంగా అందించాలన్న నిబంధనను ప్రభుత్వం విధించలేదు.

బహుశా మన దేశంలో వైరస్ కలకలం పరిమితంగానే ప్రభావం చూపుతుండడం వల్ల ఇంకా మూఢ విశ్వాసాల ప్రచారం, ప్రైవేటు రంగం మీద ప్రేమ కొనసాగుతూ వుండవచ్చు. ఒకవేళ మన దేశంలో కూడా కోవిడ్-19 విజృంభిస్తే? అలా జరగకూడదని మనమంతా కోరుకుంటున్నాం. అయినప్పటికీ, ఒకవేళ పరిస్థితి ముదిరితే, అప్పుడు మన దేశంలో కూడా ఇతర దేశాలలో మాదిరిగానే సామాజికీకరణ దిశగా అడుగులు వేయక తప్పదు.

అయితే ఇందుకు వ్యతిరేక దిశలోనే ఇప్పటికీ కొనసాగాలనే ప్రయత్నిస్తున్న వారు ఉన్నారు. ఈ సంక్షోభాన్ని అడ్డం పెట్టుకుని పక్క వాడిని తొక్కేసి తాను మాత్రం పైకి రావాలనుకునే పాపిష్టి ఆలోచన ఇది. 'క్యూర్‌వాక్' అనే జర్మనీ కంపెనీ కోవిడ్-19ని నిరోధించే వ్యాక్సిన్‌ను తయారు చేస్తున్నదని తెలుసుకుని దానిపై సర్వ హక్కులనూ తామే పొందాలని ట్రంప్ ప్రయత్నించాడు. తద్వారా ఆ వ్యాక్సిన్ అమెరికాలో మాత్రమే దొరికేలా, తక్కిన దేశాలకు దొరక్కుండా పోయేలా చేయాలని చూశాడు. అయితే జర్మన్ ప్రభుత్వం ఈ ఎత్తుగడ పారనివ్వలేదు. ఇలాంటి మరో దిక్కుమాలిన ఆలోచనే సమాజంలో ఒక భాగానికి మాత్రం రక్షణ చర్యలను పరిమితం చేసి తక్కిన వారిని, ముఖ్యంగా వృద్ధులను, మహిళలను, పేదలను వారి ఖర్మానికి వదిలి పెట్టెయ్యడం. ఒక పక్క కోవిడ్-19 తాకిడితో ఇరాన్ విలవిల్లాడుతూ వుంటే ఆ దేశంపై ఆంక్షలను కొనసాగించి తీరాల్సిందేనని ట్రంప్ పట్టుబట్టడమూ ఈ కోవలోకే వస్తుంది. సంపన్న వర్గాల వారు, బలవంతులు, అధికారంలో ఉన్నవారు క్షేమంగా ఉంటే చాలునని, పేద వారిని, బలహీనులని, మహమ్మారి బారినపడి చావమని వదిలెయ్యడం పెట్టుబడిదారీ దృక్పథపు లక్షణమే. కరోనా నేపథ్యంలో సార్వత్రిక ఆరోగ్య పరిరక్షణా విధానం గురించి గట్టిగా ప్రచారం చేసిన బెర్నీ శాండర్స్ అమెరికా అధ్యక్ష అభ్యర్థి రేసులో వెనకబడడం అమెరికాలో ఈ పెట్టుబడిదారీ దృక్పథం ఇంకా బలంగానే ఉందని సూచిస్తోంది.

కాని ఈ పెట్టుబడిదారీ ధోరణికి ఒక సహజమైన పరిమితి ఉంది. కోవిడ్-19 మహమ్మారి ప్రత్యేకత ఏమంటే దానిని ఒక దేశానికి కాని, ఒక ప్రాంతానికి కాని, సమాజంలో ఒక తరగతికి కాని పరిమితం చేయడం అసాధ్యం. ఒకవేళ ఎవరైనా, ట్రంప్ మాదిరిగా తెలివితక్కువగా అటువంటి ప్రయత్నం చేస్తే అమెరికాలో జరిగినట్టే అవుతుంది. దీనర్థం మానవజాతి యావత్తు ఒకరివెంట మరొకరు పెట్టుబడిదారీ విధానాన్ని తోసిరాజని మెరుగైన కొత్త వ్యవస్థ గురించి ఆలోచించడం మొదలు పెట్టేస్తారని కాదు. కాని ఈ మహమ్మారిని నియంత్రించడం కోసం జరిగే కృషిలో పెట్టుబడిదారీ వ్యవస్థను దాటి ఆలోచించే వారిది (సోషలిజం కావాలని కోరే వారిది)

పైచేయి కావాలి. ఈ మహమ్మారి కొనసాగుతున్న కొద్దీ అందుకు గల అవకాశాలూ కొనసాగుతాయి.

ప్రస్తుతం పెట్టుబడిదారీ ప్రపంచీకరణ యుగంలో ఈ మహమ్మారి వల్ల కలిగే దుష్ఫలితాలను, పర్యవసానాలను తట్టుకొని నిలబడే శక్తి సామర్థ్యాలు పెట్టుబడిదారీ వ్యవస్థకు లేవని స్పష్టం అయిపోయింది. ప్రస్తుతం పెట్టుబడిదారీ విధానం సరుకులు, పెట్టుబడి, ద్రవ్యపెట్టుబడి-అన్నింటి కదలికలనూ ప్రపంచీ కరించింది. ప్రపంచీకరణ ప్రక్రియ అనేది ఇంతవరకే పరిమితంగా జరుగుతుందని ఆ శక్తులు ఆశించి వుండొచ్చు. కాని అలా జరగలేదు. వేగంగా ఈ మహమ్మారి కూడా ప్రపంచమంతటా విస్తరించింది. వైరస్‌లు ప్రపంచమంతటికీ వ్యాపించడం ఈ ప్రపంచీకరణ కాలపు అనుభవం.

ఈవిధంగా ప్రపంచమంతటికీ అంటువ్యాధి విస్తరించి అధిక సంఖ్యలో మరణాలు సంభవించడం అనేది గతంలో ఒక్క 1918 లో నే జరిగింది. అప్పుడు స్పానిష్ ఫ్లూ వైరస్ ప్రపంచ మంతటా వ్యాపిం చింది. ఇది మొదటి ప్రపంచ యుద్ధం సాగుతున్న సమయంలో నడిమధ్యలో జరిగింది. వేలాది మంది సైనికులు ఎన్నో వేల మైళ్లు సరిహద్దులు దాటి వెళ్లి యుద్ధంలో పాల్గొని మళ్లీ తిరిగి వెనక్కి తమ ఇళ్లకు చేరుకున్నారు. ఈ క్రమంలో ఈ వైరస్‌ను తమ వెంట మోసు కొచ్చారు. నిజానికి ఆ ప్రపంచ యుద్ధం ఈ వ్యాధిని వ్యాపించకుండా నిరోధించగల దేశాల అడ్డు గోడలనన్నింటినీ బద్దలు గొట్టి దానిని ప్రపంచ వ్యాప్తం చేసింది. 2003లో సార్స్ వైరస్ 26 దేశాలకు విస్తరించింది. ఇది కూడా ప్రమాదకరమైనదే. కాని దీనివలన 800 మంది మాత్రమే మరణించారు. ప్రస్తుతం కోవిడ్-19 ఇంతకు ఇరవై రెట్లు ప్రాణాలను బలితీసుకుంది.

అప్పుడు (1918) దేశాల అడ్డు గోడల్ని బద్దలు గొట్టడానికి ఒక యుద్ధమే అవసరం అయ్యింది. కాని ఇప్పుడు ప్రపంచీకరణ క్రమమే దేశాల ఎల్లల్ని చెరిపేసింది. అందుకే ఇప్పుడు మనం చవిచూస్తున్న కోవిడ్-19 తరహా అంటువ్యాధులు ప్రస్తుత పెట్టుబడిదారీ దశలో అంతర్భాగంగా పెరుగుతున్నాయి. ట్రంప్ లాంటి వాళ్లు వీటిని కొంతమందికే పరిమితం చేయాలని ప్రయత్నించినా ఆ ప్రయత్నాలు విఫలం అవుతాయి. ప్రపంచీకరణ సృష్టించిన వ్యవస్థ లేవీ ఈ మహమ్మారిని నియంత్రించడంలో జయప్రదం కాలేవు.

ఈ మహమ్మారి లాంటి సవాళ్లే ప్రస్తుత పరిస్థితుల్లో మరికొన్ని ఉన్నాయి. **మొదటిది - ప్రపంచ ఆర్థిక సంక్షోభం.** దీనిని ప్రస్తుత పెట్టుబడిదారీ వ్యవస్థ రూపొందించిన యంత్రాంగం ఏదీ పరిష్కరించలేదు. కనీసం అన్ని ప్రభుత్వాలూ మూకుమ్మడిగా పట్టుపట్టి ప్రజల కొనుగోలు శక్తి పెరిగేవిధంగా ఉద్దీపన కార్యక్రమాన్ని

తీసుకోవాలి. ఇందులో ప్రభుత్వాలదే ప్రధాన పాత్రగా ఉండాలి. ప్రైవేటు కార్పొరేట్లే అభివృద్ధికి చోదక శక్తులుగా పని చేస్తాయన్న వాదనలు ఇప్పుడెంత మాత్రమూ పనికిరావు. 'ప్రపంచం అంతా ఎలా పోయినా, నా అమెరికా మాత్రం ఈ సంక్షోభంలో లేకుండా చూస్తాను' అన్న ట్రంప్ మాటలు ఏవిధంగా కొరగాకుండా పోయాయో మనం చూస్తున్నాం. అందరూ కలసి ఉమ్మడిగా పట్టుపట్టి కోవిడ్-19ని నిర్మూలించినట్టే, ప్రపంచ ఆర్థిక సంక్షోభాన్ని కూడా అన్ని దేశాలూ ఉమ్మడి పట్టుపడితేనే అడ్డుకోగలవు. కాని 'ఉమ్మడి' ప్రయోజనాలకు పూర్తి వ్యతిరేకంగా ఆలోచించే పెట్టుబడిదారీ దృక్పథంతో ఈ సంక్షోభాన్ని నివారించగలుగుతామా?

**రెండవది - పర్యావరణ సమస్య :** ఈ పర్యావరణ విషయంలో తలెత్తిన సంక్షోభం (ప్రపంచ ఉష్ణోగ్రతలు పెరిగిపోవడం, కాలుష్యం పెరిగిపోవడం) పెట్టుబడిదారీ వ్యవస్థ సృష్టించినదే. దీనినుంచి బైటపడగలిగే శక్తి దానికి లేదు. ప్రపంచం యావత్తూ ఉమ్మడి పట్టు పట్టవలసిన సవాలు ఇది.

**మూడవది - కాందిశీకుల సమస్య :** పెట్టుబడిదారీ వ్యవస్థ తాకిడిలో, అది సృష్టించిన యుద్ధాలలో, అశాంతిలో చితికిపోయిన కాందిశీకులు రోజురోజుకూ పెరుగుతున్నారు. పెట్టుబడిదారీ వ్యవస్థకి యుద్ధాలు సృష్టించడమెలాగో తెలుసు కాని శాంతిని ఎలా నెలకొల్పాలో దానికి తెలియదు. చేతకాదు.

ఈ సంక్షోభాలన్నీ కలిపి పెట్టుబడిదారీ వ్యవస్థ చివరి ఘట్టానికి చేరిందన్న వాస్తవాన్ని సూచిస్తున్నాయి. ఇప్పుడు కొనసాగుతున్న ఆర్థిక సంక్షోభం అప్పుడప్పుడూ వచ్చిపోయే సంక్షోభం కాదు. ఇది ప్రపంచీకరణ క్రమంలోనే వ్యవస్థీకృతమై వుంది. దీర్ఘకాలం కొనసాగే స్వభావం దీనికుంది. పర్యావరణ సంక్షోభమూ అటువంటిదే. దానంతట అదే పోయేది కాదు. కోవిడ్-19 మహమ్మారి కూడా అలాంటిదే. ప్రపంచీకరణ కాలంలో భూగోళమంతా శరవేగంతో విస్తరించగల వైరస్‌లు ఒకదాని వెంట మరొకటి వస్తున్నాయి. ప్రపంచ మానవాళి అంతా ఏకమైతే తప్ప వీటిని ఎదుర్కోలేం. అలా అందరినీ ఏకం చేసి నిలపగల శక్తి పెట్టుబడిదారీ శక్తులకు ఏమాత్రమూ లేదు. 'స్వేచ్ఛా మార్కెట్' అన్ని సమస్యలనూ పరిష్కరించేస్తుందన్న సిద్ధాంతం ఎంత పనికిమాలినదో ఇప్పుడు స్పష్టం అవుతోంది. అటువంటి సిద్ధాంతాల పరిధులను అధిగమించి ఆయా ప్రభుత్వాలు కోవిడ్-19ని ఎదుర్కోవడానికి చేస్తున్న ప్రయత్నాలే, వ్యక్తిగత లాభాపేక్షను పక్కనబెట్టి (తాత్కాలికంగా అయినా సరే) ఉమ్మడి ప్రయోజనం కోసం చేస్తున్న కృషే రానున్న కాలం నూతన, ప్రత్యామ్నాయ శక్తులది అని సూచిస్తున్నాయి.

●

పెట్టుబడిదారీ ఆర్థిక సంక్షోభం ప్రపంచాన్ని చుట్టుముట్టింది. అన్ని ఖండాల్లోని పెట్టుబడిదారీ దేశాలన్నిటా ఆకలి కేకలు వినిపిస్తున్నాయి. నిరుద్యోగం ప్రబలింది. ఆర్థిక అసమానతలు పెరిగాయి. భారత దేశ పరిస్థితి దీనికి భిన్నంగా ఏమీ లేదు. ఆర్థిక సంక్షోభానికి తోడు కరోనా మహమ్మారి కాలంలో పెట్టుబడిదారీ ప్రభుత్వాలు అనుసరిస్తున్న నయా-ఉదారవాద విధానాలు శ్రామిక ప్రజల జీవనాన్ని మరింత దుర్భరం చేస్తున్నాయి. 1980వ దశకంలో అట్టహాసంగా ప్రకటించిన నయా-ఉదారవాద విధానాలు పెట్టుబడిదారీ వ్యవస్థలోని అన్ని సమస్యలకూ సర్వరోగనివారిణిగా ప్రచారం చేసుకున్నారు. కానీ మూడు దశాబ్దాలు గడిచేసరికి ఆ విధానాల డొల్లతనం ప్రస్తుత ఆర్థిక సంక్షోభ రూపంలో బయటపడింది. భారత దేశంలో నరేంద్ర మోడీ ప్రభుత్వ కార్పొరేట్ అనుకూల నయా-ఉదారవాద విధానాల వల్ల దేశం కరోనాకు ముందే మాంద్యంలోకి జారుకున్నది. కరోనా మహమ్మారిని అరికట్టడంలో మోడీ ప్రభుత్వ అసమర్థత వల్ల పరిస్థితి మరింత దిగజారింది. ఒకవైపున ఆర్థిక సంక్షోభం, ఉపాధి కోల్పోవడంతో పాటు, అన్ని నిత్యావసర సరుకుల, ప్రత్యేకించి పెట్రోలియం ఉత్పత్తుల ధరలు దారుణంగా పెరగడం ప్రజలనుభవిస్తున్న దుర్భర పరిస్థితిని మరింత తీవ్రం చేస్తున్నది. మోడీ ప్రభుత్వ హయాంలో తారాస్థాయికి చేరిన ఆశ్రిత పెట్టుబడిదారీ విధానం ప్రజల వద్ద ఏమీ మిగల్చలేదు. భూములు, గనులు, అడవులు, అంతరిక్షంలోని టెలికాం స్పెక్ట్రమ్‌లు అన్నింటినీ కార్పొరేట్లకు అర్పించేస్తున్నారు. అందుకు చట్టాలు ఆటంకంగా ఉంటే ఆ చట్టాలనే మార్చేస్తున్నారు. రాజ్యాంగాన్ని బేఖాతరు చేస్తున్నారు. ఈ విధానాలు సామాజిక న్యాయాన్ని దారుణంగా దెబ్బతీస్తున్నాయి. ప్రజాధనంతో నిర్మించిన లక్షల కోట్ల విలువ చేసే ప్రభుత్వ రంగ సంస్థలను గుండుగుత్తగా అమ్మేస్తున్నారు. ప్రభుత్వం నుండి ఏక కాలంలో తీవ్రతరమైన ఈ దాడులు దేశంలోని కార్మిక, రైతాంగ ఇతర శ్రామిక వర్గాలన్నీ ఏకమై ఎదిరించాల్సిన అనివార్య పరిస్థితులను కూడా కల్పిస్తున్నాయి. రైతులు, వివిధ సెక్షన్ల కార్మికులు, ఉద్యోగులు దేశవ్యాపిత పోరాటాల్లోకి వస్తున్నారు. ఈ ఆర్థిక సంక్షోభం, దానికితోడు కరోనా మహమ్మారి నేపథ్యంలో ప్రపంచ, భారత ఆర్థిక వ్యవస్థలు నడుస్తున్న తీరుతెన్నులు, నడవాల్సిన మార్గాలను సూచిస్తూ ప్రముఖ ఆర్థికవేత్త ప్రభాత్ పట్నాయక్ రాసిన పుస్తక త్రయంలో ఇది ఒకటి.



PSBH ప్రజాశక్తి బుక్‌హౌస్

